


జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.





సంపుటము - 19 రాజమహేంద్రవరము 16-11-95, 1-12-95 సంచికలు 1, 2


## ఈ సంచికలో రచయితలు — వారి రచనలు


1. శ్రీ రామడుగు వేంకటేశ్వరశర్మ .... కర్రి నాగార్జునశ్రీగారి కవి చంద్రులు చేసిన వీనుల విందులో అభిజాత్యం - ఒక పరిశీలన

2 శ్రీ టి శ్రీరంగస్వామి .... విశ్వనాథవారి సాక్షాత్కారము

3 శ్రీ శిష్టా హరగోపాలరావు .... మత సామరస్యం మన ధ్యేయం

4 శ్రీ కోయిల్ కందాడై తిరుమలాచార్యులు .... ముక్తి

5 శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు .... "తోరణము" కీ॥శే॥ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి కావ్యకుసుమ సౌరభం

6 డా॥ పొన్నా లీలావతమ్మ .... కుమతి శతకం ఇతివృత్త విశ్లేషణ పరామర్శ

7 శ్రీ ఖండాపు మన్మథరావు .... రూపాంతరం



1, 16 తేదీలలో ప్రచురింపబడును.

సంవత్సర చందా రూ. 20-00 లు 6 మాసముల చందా రూ. 12-00 విడి ప్రతి రూ. 2-00

శ్రీ నాగార్జునశ్రీగారి

# "కవిచంద్రులు చేసిన వీనుల విందు" లో "అభిజాత్యం" - ఒక పరిశీలన

—రామడుగు వేంకటేశ్వరశర్మ

శ్రీ నాగార్జునశ్రీగారు రచించిన "కవి చంద్రులు చేసిన వీనుల విందు" (పద్యాలు—సవిమర్శ దృశ్యాలు) అనే గ్రంథం సాహితీ ప్రియులకు అవశ్య పఠనీయం. ఇందలి భాష సరళమైనది. అందమైనది. చదివింపజేసే లక్షణం గలది. ఇందలి ఇరవై నాలుగు వ్యాసాలలో చాల వ్యాసాలు "సాహిత్యం ఆలోచనామృతం" అన్న సూక్తిని సార్థకపరిచే రీతిలో పద్య రచనా సారస్యాన్ని అందించే పసందైన విందులుగా స్ఫురిస్తాయి. వీరి మౌలికమైన ఆలోచనలకు నిలువుటద్దాలుగా నిలుస్తాయి. విశేషించి ప్రాచీనాంధ్ర కావ్యవ్యాఖ్యాతలు, విమర్శకులు చెప్పిన అభిప్రాయాలను కాదనడమేకాక, భావిపరిశోధకులకు క్రొత్త అంశాలను అందివ్వగలిగిన ఆయన ధైర్య సాహస శక్తి యుక్తులు అభినందనీయాలు. అయితే, "అభిజాత్యం" అనే వ్యాసం గూర్చి కొద్దిగా పరిశీలిద్దాం :—

"నాయన్న బాము దలపవ
యీ యొడ, లీచీర, యట్టియేవపు చందం
బోయన్న ! మదన వికృతిం
జేయుననుట యెంతయును నిషిద్ధముగాదే !"

ఇది తిక్కన భారతం విరాటపర్వంలోనిది. తనను చూసి మదన వికారం చెందిన కీచకునితో సైరంధ్రి పలికిన విషయమిది. "ఓ అన్నా ! నా హీన స్థితిని తలంపవా! ఈ యొడ, లీచీర, ఇట్టి అసహ్యకరమైన విధానం నీకు మదనవికృతిని కలిగించడం ఎంతయు నిషిద్ధం కదా !" అని భావం. ఈ సందర్భంగా నాగార్జునశ్రీగారు— "సైరంధ్రి 'ఓ అన్నా!' అని సంబోధించింది. ఇక్కడ "అన్న" పదానికి తనకన్న ముందు పుట్టిన మగతోబుట్టువని కాని, జ్యేష్ఠ సోదరుడని కాని అర్థం చెప్పడం రసాభాస చేయటమే అవుతుంది. సైరంధ్రిని అభిజాత్యం కలిగిన స్త్రీగా కాక పామర స్త్రీగా దర్శించినట్లవుతుంది. కామంతో కళ్ళు పొరలు కప్పిన వ్యక్తిని సైరంధ్రి 'సోదరుడా!' అని సంబోధించి తన శరీరాన్ని, చీరను తీరును ప్రస్తావించినదని చెప్పడం కవి కల్పించని నీచ హాస్యమవుతుంది. సైరంధ్రి ఉదాత్తపాత్ర" అన్నారు. అలాకాక 'ఓ అన్నా!' సంబోధన క్రమంగా సంఘ జీవితంలో గౌరవాన్ని పొందుతున్న వ్యక్తి అనే రూఢ్యర్థంలో స్థిరపడిందని నిష్కర్షగా చెప్పవచ్చు "నన్నారు." ఆ సంబోధన జ్యేష్ఠ సోదరుడన్న అర్థాన్ని ఒక దశలో కోల్పోయిందని చెప్పడానికి తిక్కనగారు వ్రాసిన ప్రస్తుత పద్యమే సరియైన ప్రమాణంగా నిలుస్తుంద"న్నారు. కీచకుడు గౌరవార్హుడని సంభావించి సైరంధ్రి మొదట పేరు పెట్టకుండా 'అన్నా!' అని సంబోధించింది. కీచకుడి నైజం అర్థమయ్యాక పేరుతో పిలిచి తీవ్రంగా కూడ హెచ్చరించింది— అని "దుర్వారోద్యమ....కీచకా!" అన్న పద్యాన్ని కూడ ఉదహరించి మరీ వివరించారు.

దీన్ని విచారించే ముందు ఈ సందర్భంలో ఈ ఘట్టంలో మూల భారతంలో ఏముందో ముందు పరిశీలించాలి.

"అప్రార్థనీయా మిహమాం! సూతపుత్రా భిమన్యతే
విహీనవర్ణాం సైరంధ్రీం ! బీభత్సాం కేశకారికామ్ ॥"
(14 అధ్యాయము_!5వ శ్లో॥ విరాటపర్వం)

మూలంలో 'సూతపుత్రా!' అని కీచకునికి సంబోధన ఉంది. దాన్ని తిక్కనగారు అనువాదంలోకి తేలేదు. 'అప్రార్థనీయాం' అనే పద సంబంధమైన విశేషార్థస్ఫూర్తిని 'ఓ అన్నా!' (ఓ సోదరా! అన్న అర్థంగల) సంబోధనచేతనూ. 'విహీనవర్ణాం సైరంధ్రీం, బీభత్సాం, కేశకారికాం' అన్న విశేషణాలలోని విశేషార్థాన్ని "ఈయొడ, లీచీర. యిట్టియేవపు చందంబు" అన్న పదాలచేతను వ్యక్తీకరించడం ప్రకరణాంశమవుతుంది అసలు 'ఓ అన్నా!' అనగా 'ఓ జ్యేష్ఠ సోదరా!' అని సంబోధించి, సైరంధ్రి కీచకునివద్ద ఈయొడ, లీచీర, యిట్టియేవపు చందం

(మిగతా 16వ పేజిలో)

# సమాలోచన

* జాతీయ సాంస్కృతిక పక్ష పత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

## విశ్వనాథవారి సాక్షాత్కారము

— టి. శ్రీరంగస్వామి.

విశ్వనాథ సత్యనారాయణగారి శృంగారవీథిలో "సాక్షాత్కారము" అనునది ఒక ఖండిక. ఈ ఖండికను 1927 సంవత్సరములో జయంతి సంచికలో వెలువరించారు. ఈ ఖండికలో వ్యక్తావ్యక్తమయిన ఓ రూపును వర్ణించారు. ఆ రూపు స్పష్టంగా కనపడదు. ఆ రూపుకు సంబంధించిన భావన కూడా గొంతులో పూర్తిగా వ్యక్త పరచలేని స్థితిలో ఉంటుంది. ఈ అవ్యక్త భావన నుండి తనలో తను నిరంతరం చింతనాను భూతుడై చివరకు ఏదో ఒక రూపును బొమ్మకట్టడంతో ఈ ఖండిక ముగుస్తుందిలా—

"వీండెవడో కుమారుడుడువేకపుంగ్రాంజివురుల్ ఫలించియే
పోడిమిలేని నా హృదయమున్ దనపై పునకు కృషించుచు
న్నాడు శిరస్తలీ చలిత నవ్యమయూర విలాస బర్హ స
ప్రమాదభిరమ్యచూడుండు సరాగలిలోచన మందహాసుడున్"

సాధారణంగా ఒక విషయమును చెప్పడానికి ప్రయత్నము చేస్తుంటాం. దానికి స్పష్టత ఉండదు. స్పష్టతలేని అంశము కొరకు నిరంతరము మనను వెన్నాడుతూనే ఉంటుంది. భావమును ఇదమిత్థంగా తేల్చుకోవడానికి సమయం పడుతుంది. ఆ భావన నిమిత్తం మన ప్రవృత్తి ప్రతిక్షణం ఆలోచిస్తుంటుంది.

"ఒక మనోహరమైన యూహ హఠాత్తుగా
చింతనాంధు మనస్సు చివర తగిలి
ఒక మంచు బిందు వోలిక చల్లనైన భా
వంచింతరాత్మలోపలనుదోచి
కనిపించుచున్న వస్తుని కాయముననొక్క
సుందరాకృతి మనస్సునుజొచ్చి
ఒక్కొక్క మాట యెందోవినబండి గూడ
మొక అనర్థమరి యెంతయో ధ్వనించి
కారుచీకటి వోలెనె డారివోలె
నైన నా జీవితంబున యందు నొక్క
మె అప్రమె అపించి కొన్ని నిమేషములుగ
నమృత ఖండంబు చేయు నాయాత్మఏమి"

(నాప్రవృత్తి–భ్రష్టయోగి)

మనకు భావన హృదయములో ఒక్క మెఱపు మెఱపి అదృశ్యమవుతుంది ఆ అదృశ్య భావనను బహిర్గతము చేయ దానికి సరియైన మార్గము కనబడదు ఆ భావన—

"అస్మదీయ కంఠమున యందాడుచుండె
నా కయెహో గీతి బయటికి నుబికిరాదు
చొచ్చుకొని లోనికింబోదు వ్రచ్చిపోయె
న్హృదయమీ మహాప్రయత్నమ్మునందు"

(గిరికుమారుని ప్రేమగీతాలు)

ఆ ఊహకు కాలక్రమములో ఒక రూపు వస్తున్నది. ఆ రూపు ఎలా చిగురిస్తున్నదో క్రమానుగతమవుతున్న విధానము మనం గమనించవచ్చును. అది "........సాంద్రచంద్ర జ్యోత్స్నానోలికరమ్యమైన ప్రాభాత గత విస్పష్టార్థ మంజుల శ్రీగీతివలె........" ఉంటుందట. ఆశ్రీగీతి మనసును ఎలా కలవరపెడుతుందో. ఆ ఊహ నిలువ నీయకపోవడము కూడా చేస్తుంది.

"అనవసరమ్ముగా హృదమంతయు సంచలనమ్ము పొందిక
న్గానలను చాష్టముల్ తఱుముకొంచు ప్రవాహము కట్టవచ్చునే
ధ్వనివినిపించినన్ హృదయ తాపము వాపునదేయటంచు గ
న్గాసెదనకాపోయి మగొందును శూన్యములైనదృక్కులన్"

ఆ ఊహ చివరకు ఆకాశమంతా నిండి మువ్వల మ్రోతలా వినిపించుచున్నది.

"ఈయవితార్ద్వమెల్లనినదించెడి మువ్వలమ్రోతదూరమై
పోయిన గోతతిన్ పిలుచువోలి నేదొ వినిస్వనించెడున్
రాయిడిపొందుచున్ దలచరుక వగర్చి పురానుభూతముల్
తీయని భావముల్ స్మృతికి దెచ్చుకొనన్వలవంత గుందెదన్"

ఆ మ్రోత అంతఃకరణములోనున్న వేదనకు ప్రణవములై వినదించినది. అంతేకాదు ఏమియో తీయని భావములు స్పష్టములై భాసించి రాపిడిపెట్టినవి. ఇన్నిరోజులు కలవరపెట్టిన భావములు, మనస్సును కుదిపివేసిన భావములు గోత తిని బిడుచువోలిక ఆకాశమంతయు నిండి నిబిడీకృతమైయున్న యా శబ్ద బ్రహ్మము పరమేశ్వర తత్వము వంకకు తన వాక్కుల నాకర్షించుచున్నది. ఆ పరమేశ్వర తత్వము పట్టుకొనవలెనని జీవుని వేదన పొందసాగినది.

ఊహ కావ్యమునందు గుణాలంకారరూపమున నుండును. గుణాలంకారములు భావన నుండి పుట్టును. భావన వేదనా ప్రసవము. అనగా వేదనయొక్క జ్వలనము. అనగా రసాకూతి యందలి జీవుని వేదన రసానుభూతిదశ నారోపించుటకు చేయు వ్యాపారము. ఇట్టి భావనామయమైన యూహ వైభవముతో సత్యనారాయణగారు "సాక్షాత్కారము" ఖండికను రచించారు.

ఆఊహ ప్రతి నిముషంబు క్రమక్రమ వర్ధితమైన యీ భరోన్నతి యతి సూక్ష్మమై ఖరిని నా హృదయాంతరితాంతర ప్రవిస్తృత గమనంబులన్ జెలగిరేపెను." అవి ఈదృక్ మార్గములన్ నిరాకృతులుకావు, సాకృతులుకావు కాదేదో నల్లదనాలతో మెఱుగులై హేలాచలద్రేఖలై ప్రోరింగపెట్టెడు మొల్కయై త్రిజగతి పుణ్యంబు సాకారమైనది, చివరకు అది బాలకృష్ణుని రూపముగా ఆకృతి కట్టుకొన్నది.

"ఏడెవడో కుమారకుడు........ నా హృదయమున్ దన వైపునకు కృషించుచున్నాడు. శిరస్తవా చలిత నవ్యమయూర విలాసబర్హ సమ్మోదభిరమ్య చూడుడు సరాగవిలోచన మందహాసుడున్" ఆ ఊహయొక్క అనుభూతి అలౌకికము. ఏక రూపము. దాని స్వరూపము పరమేశ్వరతత్వముగా రూపొందినది. ఏభావమయినా ప్రపంచితమయినప్పుడు నిలువనీయదు. మూల ముట్టుగ కదిలించివేయుచు, సస్వరూపమనుభములోనికి దెచ్చును. వేదన చెందింప చేస్తుంది. వేదన అనజీవ చైతన్యము నందు కలుగుదీప్తి. యదార్థమునకు చైతన్యము పరమేశ్వర స్వరూపము. పరమేశ్వర సాక్షాత్కారసములో ఈ వేదనకు ప్రతిఫలం లభిస్తుంది.

— డా॥ టి. శ్రీరంగస్వామి
5-11-114/4
విద్యారణ్యపురి
వరంగల్లు - 506 009.



## - మత సామరస్యం మన ధ్యేయం -

రచన : శిష్ట్లా హరగోపాలరావు

ఆ॥వె॥ పుట్టినారు జనులు పున్నెముతోడుత
భిన్న భాషలున్న భారతమున
ఎన్ని మతములున్న ఎదలున్న మనుజులు
ఉన్నచోట నెపుడు ఉన్కి కలదు.

ఆ॥వె॥ నేడు భారతావని నైక్యమ్ముకోసమై
ప్రాకులాడుచుండె ప్రతిన, బూని
దుష్టశక్తులెన్నొ దురాలోచనతోడ
నష్టపరచుటకును నడుముకట్టె ।

ఆ॥వె॥ భారతోర్వియందు భిన్న సంస్కృతులున్న
మతవాద మెపుడు మెదలకుండ
చూడగల్గెనేని సురుచిర భావము
కలుగు జనుల కెపుడు కాంక్షతోడ ।

ఆ॥వె॥ దేశమెల్లెడలను దేశ సమైక్యత
కుంటుపడనినాడు కుదురుగుండు
మతముకన్న మిన్న మానవత్వమ్మని
తలచినపుడు యెవరు తగవుపడరు.

ఆ॥వె॥ మూఢనమ్మకాలు, మూఢవిశ్వాసముల్
నమసిపోయి నపుడె సౌఖ్యమబ్బు
సామరస్యమైన సరళితోయున్నచో
శాంతి జీవనమ్ము సాగిపోవు ।

ఆ॥వె॥ హితము తెలుపు మతము హీనముకాదని
తలప వలయు జనులు వినపుతోడ
సమ్మతమ్ము అయిన సరియగు మతమునే
ఆదరింతు రెల్ల అవనిలోన ।

ఆ॥వె॥ మనిషి మనిషి కొరకు మనుగడ సాధించు
మతము ఏదియైన మంచిదగును
మనుజులెల్ల భువిని మతసహనమ్మును
కలిగియున్ననాడు కొదవలేదు।

ఆ॥వె॥ మనుజులెల్ల వారి మతమౌఢ్యములు వీడి
ప్రేమ మీర కలసి పెరుగుచున్న
ఐకమత్యమపుడె అధికతరమ్మయ్యి
వీడి పోరు జనత విముఖులగుచు ।

ఆ॥వె॥ మతములోన మనము కలహించినామని
వర్తమానము నదె వతను పలుక
చరితయందు మనము చవిచూచియున్నట్టి
చేదు నిజము విపుడు వెలుగుచుండు ।

ఆ॥వె॥ అక్షరాస్యులైన అవని మనుజులెల్ల
మంచిచెడ్డ లరసి మసల గలరు
శాంతి దాంతి కల్గి సతతము నెల్లరు
కలసి యుండగలరు కలతలుడిగి ।

ఆ॥వె॥ మతముపేర నెపుడు మారణహోమము
జరుగకూడ దనుచు జనత కున్న
సమత. మమత కలిగి సఖ్యతతోకూడి
మసల గలరు ఎపుడు మానవాళి ।

ఆ॥వె॥ మతము ఏదియైన మనసులు కలిసుంటె
దివియె భువికి నపుడు దిగ్గునొచ్చు
లోకమందు మన్న లౌకిక వాదాన్కి
రక్షణమ్ము కలుగు తక్షణమునె ।

భవదీయుడు
శిష్ట్లా హరగోపాలరావు

# ముక్తి

—కోయల్ కందాడై తిరుమలాచార్యులు

నాస్థాధర్మే నవసునిచయే నైవకామోపభోగే
యద్యద్భవ్యం భవతుభగవన్ పూర్వకర్మానురూపం
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేపి
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తి రస్తు.

మనబోటివారికి కనువిప్పు కలిగించి మనదృష్టిని కొంత దైవమార్గమున మళ్ళింపవలచిన శ్రీకులశేఖరాళ్వారు "ముకుంద మాల"యను శీర్షికన 40 శ్లోకములు వ్రాయించిరి పై శ్లోకము అందులో నొకటి.

నేటి సంఘ జీవనమున సుమారు నూటికి తొంబదిమంది ఉదయము లేచింది మొదలు రాత్రి నిద్రించువరకు ఉద్యోగ ధర్మాలలోను. గృహసంబంధ కార్యకలాపాలలోను తమ దైనందిన కార్యక్రమాల్ని కొనసాగిస్తూ భగవద్ధ్యానము వైపునకు దృష్టి సారించుటలేదని అనుట బహుశః అతిశయోక్తి కానేరదేమో! అంటే దైవధ్యానము చేయనివారే అందరూవున్నారా! మరి [illegible] మంది దైవధ్యానము చేయువార్ని మేమెన్ని సార్లో చూచామే యని ఈ వ్యాసం. చదివే పాఠకులలో చాల మంది ఆశ్చర్యపడుదురు.

అయితే నేడు మనము చూచు "భక్తులు" "దైవారాధకులు" అనేక తీరులలో కానవత్తురు. "ఆపద మొక్కులు - సంపద మఱపులు" అను నానుడియున్నది. ఈ కోవకు చెందినవారు వారికి వచ్చిన ఆపదలకు భగవంతుని ఎఱగచూచి తమ వాంఛితములు నెరవేరిన తమ ప్రకటన మేరకు మొక్కులు మొక్కుట కేవలము వారి స్వార్థబుద్ధిని చాటునేగాని వారి యందు వాస్తవమైన దైవభక్తి యిసుమంతైనా కానరాదు. ఇక మరియొక తెగ మనకు తరచుగా తటస్థించునది. ఇంటియందుగాని, దేవళములందుగాని పదిమందికి తమ భక్తి పారవశ్యాన్ని, భక్తి శ్రద్ధలను చాటుటకు వచ్చిన కేశవనామాదులో, దండకాలో, యిల్లు ఎగిరిపోయేటట్లు పఠించి, మేలురకానివి. ఎక్కువ ధర గల సుగంధద్రవ్యాదులతో చేయు ఆరాధన చూపరులకు వారి దైవభక్తి యెట్టిదో ప్రకటితమగును." ఆత్మశుద్ధిలేని ఆచారమది యేల చిత్తశుద్ధిలేని పూజలేల?" అన్నపద్యాన్ని చిన్నప్పుడు నేర్చుకొన్నాము.

మానవ జన్మ అన్ని జన్మలలోను శ్రేష్ఠమైనది. ఎన్నో నోములు నోచినగాని మనకీ జన్మ లభించదు అయితే యిపుడు మనకున్న స్థితి అది గొప్ప. బీద. ఎక్కువ తక్కువ విద్యార్హతలు, నడవడి. సంఘ గౌరవము మున్నగునవ బ్బుటకు మన పూర్వజన్మ సుకృతమే కారణము. పూర్వజన్మలో మన స్థితిగతులు ఆ ముందటి జన్మలో చేసికొన్న మంచిచెడుల ఫలితమే; ఈ ప్రస్తుత జన్మలో చేసికొన్న మంచి చెడుల ఫలితమే మన మరుజన్మకు దర్పణము కాగలదని పై శ్లోక గూఢార్థము.

కాబట్టి పైన పేర్కొనబడిన అంశాల్ని మరొక్కమారు మననం చేసికొని మన విద్యుక్త ధర్మాన్ని గూర్చి ఆలోచింప వలసిన అవసరం ఎంతైనావుంది. దీనికి మనం ప్రతి ఒకరం ఏం చేయాలి? అన్నది ప్రశ్న.

1. మనం మన ప్రస్తుత నడవడిని బేరీజు వేసుకోవాలి.
2. మనకు పూర్వజన్మ, మరుజన్మలపై విశ్వాసంవుండాలి.
3. నిష్కల్మషమైన, నిస్వార్థమైన దైవచింతనముండాలి.
4. "పరోపకారార్థమిదం శరీరం" అని నానుడి. అనగా ఈ జన్మ. దేహము యితరుల సేవా నిమిత్తమే యని గ్రహించుట అనగా మనకు శక్తియున్నంత మేరకు యితరులకు నిస్వార్థ సేవ చేయుట.
5. దైనందిన చర్యల ముగించుకొని, చిత్తశుద్ధితో నిరాడంబరమైన దైవధ్యాన మొనరించుట.
6. ఉన్నదాంట్లో అన్నివిధాలా తృప్తిని చెందుట.
7. చేయు దుష్కార్యముల పట్ల పాపభీతి కలిగి వానికి దూరముగ నుండుట.

"హరియను రెండక్షరములు
హరియించును పాతకములు".........అన్న పద్యాన్ని అర్థం చేసుకొంటే హరి ధ్యానము మనను సన్మార్గులుగా తీర్చిదిద్ది, మనము చేసిన పాపాలేమైనావుంటే వాటిని పారద్రోలు కొన వచ్చును. దీనివల్ల తృప్తి, మనశ్శాంతి ఏర్పడుతుంది. మరు జన్మ యింకా శ్రేష్ఠమైనది లభిస్తుంది. అదియే ముక్తి.

సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం
నిశ్చల తత్వే జీవన్ముక్తిః-అన్నానుడి మనం మరువరాదు.
"సర్వేజనాః సుఖినో భవంతు".

కోయిల్ కందాడై తిరుమలాచార్యులు
రిటైర్డు ప్రధానోపాధ్యాయులు
6-72/4. శ్రీనిలయం
ఇబ్రహింపటన్.
రం. రె. జిల్లా
501 506 ఆం. ప్ర.



## "తోరణము"

కీ॥ శే॥ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి
కావ్యకుసుమ సౌరభం
—శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు



ఆధునిక ఆంధ్ర మహాకవులలో శ్రీ మధునాపంతుల సత్య నారాయణశాస్త్రి గారొకరు. వారు అనేక కావ్యాలను రచించారు. అందు ప్రసిద్ధమైనది ఆంధ్ర పురాణము. ఆంధ్రుల చరిత్రను సాహిత్య సౌరభంతో గుబాళించేటట్టు రచించిన నవపర్వ విల సితమైన కావ్యం ఇది. ఇంతేకాక వారు శ్రీ ఖండము, చైత్ర రథము మున్నగు ఖండ కావ్య సంపుటులను సంతరించారు. పందొమ్మిదవ శతాబ్దారంభం నుండి ఇరవయ్యవ శతాబ్ద ప్రారంభం వరకు ఖ్యాతిగాంచిన వందమంది రచయితలను గూర్చి చక్కని వర్ణచిత్రాలను "ఆంధ్ర రచయితలు" అను పేరున రచించారు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో వారు విలక్షణమైన పత్రిక "ఆంధ్రి" అనే మాసపత్రిక మూడు (1939-41) సంవత్సరాలు నడిపారు. అంతే కాకుండా వారు బోధివృక్షము, చరిత్ర ధన్యులు, కళ్యాణతారమున్నగు నవలలు భాసుని "స్వప్నవాసవదత్త" సర్వజ్ఞ సింగభూపాలుని "రత్న పాంచాలిక" దృశ్యకావ్యాను వాదములు, షడ్దర్శన సంగ్రహం, "కథా పుష్కరిణి" ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ దేవాలయాలు మున్నగు రచనలనేకం సంతరించారు. ఈ రచనలను పఠించిన రసజ్ఞ పాఠకలోకం వారికి అనేక సన్మానాలు గావించారు. "ఆంధ్ర కల్హణ" "కళాప్రపూర్ణ" మున్నగు బిరుదములు వారు గ్రహించారు. అట్టి మహాకవి రచించిన తొలి ఖండ కావ్యం "తోరణము". ఇది శాస్త్రిగారి యౌవన ప్రాదుర్భావంలో పద్దెనిమిదవయేట (1938) రచించిన కావ్యం.

"తోరణము" ఒక లఘు ఖండ కావ్యం. ఇందులో "ప్రబోధము" "పితృశిక్ష" "సత్య స్తుతి" "ముదివగ్గు" "పరి త్యక్త" "సందేశము" అను ఆరు ఖండికలున్నాయి.

ఈ ఆరు ఖండికలలో మొత్తం 40 పద్యాలున్నాయి. పుట కొక్కటి చొప్పున ఈ పద్యాలు 40 పుటలలో ముద్రించారు. ఈ కావ్యంలో 20 తేట గీతులు, 7 సీసములు, 6 కందములు, 4 చంపకములు, 2 ఉత్పలములు, ఒక ఆట వెలది ఉన్నాయి. ఈ కావ్యానికి కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు పీఠిక వ్రాశారు. ఈ కావ్యాన్ని ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు శాస్త్రిగారి మాతామహులైన కీ॥శే॥ ఆకొండి రామమూర్తిగారికి అంకితమివ్వబడింది. మధునాపంతులవారు తమ స్వగ్రామమైన పల్లిపాలెంలో వారు నెలకొల్పిన "ఆంధ్రీకుటీరం" పూసిన తొలి పువ్వుగా ఈ "తోరణము" పూయించినారు.

"ప్రబోధము" అనేది ఈ కావ్యంలోని తొలి ఖండిక. ఇందు ఆంధ్రపుత్రులకు శాస్త్రిగారు ప్రబోధం చేశారు. ఇందు

ప్రాచీన రాజకీయాచారవేత్తల మనోవృత్తుల తీరు. భారత మాతకు ఆత్మార్పణ గావించిన ఆంధ్రవీరుల చరిత్ర తెలిసికొని చంద్రగుప్త మౌర్యుడు, అశోక చక్రవర్తుల రాజ్యపాలనా ఘనతను తెలిసికొని, అల్లసాని పెద్దన కవికి కృష్ణదేవరాయలు స్వయంగా గండపెండేరము తొడిగిచూపిన ఆంధ్రభాషాదరాన్ని తలచుకొని మన మనస్సులను మరలించి మంచి త్రోవను పోవుదము రండి ఓ బుద్ధిమంతులైన ఆంధ్ర పుత్రులారా! భారతదేశంయొక్క ప్రాచీన ఘనతను, సౌభాగ్య సంపత్తులను మరచిపోకండి అని ప్రబోధం చేశారు.

ఆంధ్ర భాషాభివృద్ధి, ఆంధ్రదేశార్థికాభివృద్ధి ఏనాడు మనము సాధిస్తామో ఆరోజు మనకు ఆంధ్ర శబ్దం అన్వర్థమౌతుంది. లేకపోతే ఆంధ్ర శబ్దం పేరుకు మాత్రం మిగిలిపోతుంది. మానాభిమానాలు వీడి నిర్మమతతో భారతమాత కొలకు ఆసువు లర్పించిన ఘనులు అంబరంలో తేజస్సుతో కనిపిస్తున్నారు. నిశ్చలతతో చూడండి.

భారతవీరులు నడచిన మార్గంలో ప్రయాణంచేసి స్వాతంత్ర్య రథాన్ని మనము నలుదిక్కులకు త్రోలి ఆ పుణ్యాన్ని కట్టుకొందాము. తెలుగు సోదరులారా! మీరు కూడా పట్టు పట్టండి.

ఈ ఖండికలో హృదయ స్పందనం గావించే పద్యం ఇది :

> నొడువ జాలని యిడుమలఁ గుడిచి బడలి
> చిక్కి జీర్ణించి నిజదేశ సేవఁ జేసి
> తుదకు స్మరణీయులైన యాంధ్రులఁ దలంప
> గాజు కన్నైన నొక యశ్రుకణము రాల్చు".

స్వదేశసేవలో చెప్పజాలని కష్టాలను అనుభవించి చిక్కి జీర్ణించి తుదకు స్మరణీయులైన ఆంధ్రులను తలచుకొంటే గాజు కన్నైనా ఒక కన్నీరు బొట్టు రాలుస్తుంది. ఈ పద్యాన్ని చదివిన ఎంత పాషాణ హృదయుడైనా కరుణరసప్లావితుడై అనాడు ఆంధ్రులు పడిన బాధలకు నిజంగా అశ్రువులు రాలుస్తాడు.

"పితృశిక్ష" అనేది గొప్ప ఉపదేశం ఇచ్చే ఖండిక. ఇందు శ్రోత్రియ వంశంలో జన్మించిన వివాహితుడైన బ్రాహ్మణ కుమారుడు జూదమునకు బానిసయి ఉన్నదంతా వ్యయం చేస్తూ జీవితాన్ని పాడుచేసుకుంటుంటే శతవృద్ధుడైన తండ్రి బాధ పడుతూ ఏదో విధంగా వానికి జ్ఞానం కలిగేటట్టు చెయ్యాలని, మంచి మార్గంలో పెట్టాలని తండ్రి ఒక ఉపాయం ఆలోచించి అమలు చేశాడు. ఒక రోజున కొడుకుని పిలిచి నాయనా! నేను నీకు రోజుకొక్క రూపాయి చొప్పున ఇస్తాను. దానిని నీయిష్ట మొచ్చినట్లు ఖర్చు పెట్టుకో. నాకు పుణ్యమొచ్చేటట్టు రోజుకు రెండు పుటల చొప్పున రామాయణాన్ని చదివి వినిపించమని కోరాడు. కుమారుడు మారుమాటపలకకుండా తండ్రి ఇస్తున్న రూపాయి తీసుకొని రామాయణాన్ని తండ్రికి వినిపిస్తూ తండ్రి ఇస్తున్న రూపాయితో జూదమాడుతూండేవాడు. ఈ విధంగా కొన్నాళ్ళు గిడించింది. రామాయణాన్ని తండ్రికి పూర్తిగా చదివి వినిపించాడు. రామాయణాన్ని తండ్రికి వినిపిస్తున్న సమయంలో తానుకూడా అర్థం చేసుకుంటూ తనలో మార్పు తెచ్చుకొని కొంతకాలానికి జూదం ఆడడం మాని సుగుణ యయ్యాడు. దీనివల్ల తండ్రి మనస్సు ఊరట చెందింది. పిమ్మట తండ్రి మహాభారతాన్ని కూడా చదివించుకొన్నాడు. దానితో కుమారుడు మంచి పండితుడయ్యాడు. జూదం ఆడడం పూర్తిగా మానివేశాడు.

జూదమాడడం వలన వచ్చే నష్టాలను గూర్చి తండ్రి కుమారునకు తెలియజేసే సమయంలో చెప్పిన పద్యం సరసం గానూ, హృదయ రంజకంగాను ఉంది.

> ధనము నశియించుఁ గీరితి వెనుకఁబడును
> జ్ఞానముడివోవుఁ బరనింద కలుగు దుఃఖ
> మావహిలు స్నేహ భావమ్ము నంతరించుఁ
> బనికి మాలిన జూదంబు వలనఁ బుత్ర. (తోరణము- పుట 7)

ఈపద్యం తిరుపతి వేంకట కవులు రచించిన శ్రవణానందం లోని "ధనమా పోవును. మానమా చెడును. నిందా నెత్తిపై కెక్కు...... ...... మనమా వద్దిక నాదుమాట వినుమా మర్యాద కాపాడుమా!" అను పద్యాన్ని తలపింపజేస్తుంది. ఆఖండికలో తుదిని శాస్త్రిగారిట్లు హితోపదేశం గావించారు.

మంచి పితృఋణయున్న నెమ్మదిగ నెట్టి
చెడుగులను బుద్ధిమంతులఁ జేయవచ్చు
హితకరంబైన యుక్తియూ హించి తల్లి
దండ్రు లాత్మజులను మన్నదగు హితుబాగ

(తోరణము - పుట 24)

"సత్యస్తుతి" అనే శీర్షికలో నున్న ఖండిక అన్నవరంలోని సత్యనారాయణస్వామివారి స్తుతి. పద్యములు చాల రసవంతముగా మన్నవి. ఇందలి "అతుల గతుల సతతమును వెతల గుతిల ... ..." అను పద్యము పోతనామాత్యుని సర్వ లఘు కంద పద్యమును తలపింపజేస్తుంది.

సత్యనారాయణ స్వామీ! నీ ప్రసాదము (తినేది) ఎంత తియ్యగా ఉంటుందో ఆ విధంగానే నీవు మా కోరికలీడేర్చడం కూడా అంత మధురంగా నీ ప్రసాదంవలె మధురంగా ఉంటా యని చెప్పిన పద్యం రసవత్తరంగా భాసించి హృదయాహ్లాదాన్ని కలిగిస్తుంది.

సత్యనారాయణా ! నీ ప్రసాదమెంత
మధురమో నీ ప్రసాదమే మాకుఁ దెలుపు
నాదు కవితఁ బ్రసాదంబు మేదురముగ
సాదరముగఁ గటాక్షింపవే దయాళు!

(తోరణము—పుట 28)

"ముదివగ్గు" అనే శీర్షికతో వ్రాసిన నాలుగు సీస పద్యాలు చాల రసవంతంగాను, ముసలి తాతయ్యయొక్క స్థితి కళ్ళకు కట్టినట్లు సహజంగా వివరించారు. ముసలితనం దాపురించిన తర్వాత మనిషి పడే కష్టాలను మధునాపంతులవారు సుందరంగాను, హృదయరంజకంగాను వర్ణించారు.

"పరిత్యక్త" అనేది మరో ఖండిక. ఇందు "ఓ భరత మాతా! ఎందులకు వెక్కి-వెక్కి- దుఃఖిస్తావు. నీ యొక్క కంటి నీరు భారత భూమిపై రక్తధారలై ప్రవహించుగాక నీహృదయ బాధ దేశ దురాచార శృంఖలాలను విదళించుగాక. నీ విఫల మాంగళ్యము సంఘ దౌర్జన్య పిశాచములను వికసించుగాక. విష్పలమైన నీ ప్రళయము భారత దుర్మతాచారములను తొలగించుగాక !" అని సరసముగా వర్ణించినారు.

"సందేశము" అనే చివరి ఖండికలో సత్యనారాయణశాస్త్రి గారు మంచి సందేశమిచ్చారు. ఇది ఆంధ్రమాత తన కుమారులతో అన్నమాటలుగా మధునాపంతులవారు చెప్పిన పద్యములు. ఓ కుమారులారా ! మిమ్మల్ని ప్రేమతో పెంచి పెద్ద వాళ్ళగా చేశాను. కన్నతల్లిని మరచి పోవుట న్యాయమా! అని "నా కడుపు పండింది అని గర్వంతో మిమ్మల్ని చాలప్రేమతో పెంచాను. మీరు కూడు గుడ్డలు సమకూర్చుకొని తగువార లయ్యారు. మీరింక శక్తియుక్తులతో వర్ధిల్లుతారో కదా! నా కుమారులారా! అని. మర్యాదలేకుండా పరులకు దాసోహమని దుర్భర జీవితము గడపక త్వరగా స్వాతంత్ర్య రథమును త్రోలండి అని కన్నులలో కన్నీరు ఉంటే, శరీరంలో రక్త మాంసాలుంటే వెతకినా దొరకని మంచి తరుణం ఇదే ఓ ఆంధ్ర వీరులారా! దేశసేవ చెయ్యండి, స్వాతంత్రోద్యమంలో పాల్గొనండి. మీరు ప్రీతితో మెలగి ఒకే కార్యక్రమం కొఱకు సమైక్యంగా ఉండి దేశమాత దాస్య శృంఖలాలను త్రెంపి జీవయాత్రను సుఖం చేసుకొండి. ఓ తెలుగు కుమారులారా! వృద్ధిచెంది రాజ్యభారాన్ని మోస్తూ జీవయాత్రను సుఖం చేసుకొండి ఓ ఆంధ్రులారా అని శాస్త్రిగారు ఈ ఖండికలో సందేశ మిచ్చారు.

శాస్త్రిగారు మితభాషులు, మితహితవచనులు, అలతి అలతి పదములతో అనల్పార్థములు గోచరించేటట్టు చక్కని కవనము చెప్పాలి పువ్వుపుట్టగనే పరిమళిస్తుందన్న సూక్తికి నిదర్శనంగా శాస్త్రిగారు పిన్నవయస్సులోనే పరిమళభరితమైన చక్కని పద్య కుసుమాలను తమ కలం నుండి పూయించారు. ఈ పద్యాలను చదివి దీనికొక లఘు పీఠిక వ్రాసిన విశ్వనాథ సత్యనారాయణగారు మధునాపంతులవారు భావికాలంలో మహాకవి కాగలరని మనసారా దీవించారు. కవివాక్కు ఫలింపక

మానుతుంది। విశ్వనాథవారన్నట్లే మధునాపంతులవారు మహా కవి యయ్యారు. ఆంధ్రపురాణం వ్రాశారు. కాని మధునా పంతులవారి తొలిబిడ్డ "తోరణము" వారికి ఎంత ముద్దుబిడ్డయో మనకు కూడా అంత ముద్దు బిడ్డయే అని చెప్పాలి.

జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః ।

— ఆర్. ఏకాంబరాచార్యులు
J. R / OSD
% Director of Horticuture
Public Gardens, HYDERABAD-4.



# కుమతి శతకం - ఇతి వృత్త విశ్లేషణ పరామర్శ

డా॥ పొన్నా లీలావతమ్మ

కవి పరిచయం ; కుమతి శతకాన్ని రచించిన కవి శ్రీ కొలకుల నారాయణరావుగారు వీరు నెల్లూరు వాస్తవ్యులు బి.ఎ., బి.యల్., చదివి న్యాయవాద వృత్తి చేశారు. ఈ కవికి బాల్యం నుంచీ తెలుగు భాషా సాహిత్యాలపై విశేషమైన అభిలాష వుంది. సంస్కృతాంగ్ల భాషల్లో కూడా వీరు మంచి విజ్ఞాతులు. పదహారేండ్ల నవయౌవనంలోనే కాళిదాస మహా కవి కృతి అయిన ఋతు సంహార కావ్యాన్ని ఆంధ్రీకరించా రంటే వీరి ప్రతిభా పాండిత్యాలు ఎంతటి విశిష్టమైనవో గుర్తించవచ్చు.

కుమతి శతకానికి "మున్నుడి" వ్రాసిన న్యాయవాది శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు ఈ కవిని గూర్చి. ఈ కవిలోని కవితా ప్రత్యేకతను గూర్చి — "ఈ గ్రంథకర్త గడుసువాడు. ఇతని పలుకుబడితో జిగిబిగువులున్నవి. చిక్కందనమునకు తోడు ఈతని కూర్పులో ఔక్కందన మున్నది. పద్య విద్య కితడు క్రొత్తవాడుకాడు. ఇతని ఆంధ్రీకరణ పరిపక్వంగా వుందని ఆనాటి పండితుల్లో సుప్రతిష్ఠ వచ్చింది." అని ఉద్ఘాటించాడు.

కుమతి శతక రచనపై కవి అభిప్రాయం : కవి తాను "కుమతి" శతకాన్ని రచించడానికి కారణాల్ని వ్యక్తం చేశాడు సుమతి శతకంలో పద్య మకుటం "సుమతీ" అనే సంబోధన నామం. బద్దెన "సుమతి" ని సంబోధిస్తూ నీతులు చెప్పడాన్ని కుమతి శతక కర్త ఖండించి - దుర్బుద్ధి కలిగిన వారికి నీతులు చెప్పడంవలన సద్బుద్ధిగా మారవచ్చునుగాని ఉపదేశం సద్బుద్ధికి ఎందుకు అని ప్రశ్నిస్తూ సుమతికి నీతులు చెప్పడం సహజంగా చల్లనైన చంద్రుడికి చల్లదనాన్ని కూర్చడం వంటిదని అంటే సుమతికి నీతులు చెప్పనవసరం లేదని కవి తన అభిప్రాయం వెలడించాడు.

కుమతికి నీతులు చెప్పిన
సుమతి యగుంగాక బోధ సుమతికినేలా?
సుమతికి బుద్ధులు చెప్పుట
హిమకరునకుఁ జలువ గొలుపు టిలలో కుమతీ—3

ఇంకా సుమతికి అనేక రకాలైన సూక్తుల్ని బోధించడం సహజంగా శ్వేతవర్ణం కలిగిన మొల్ల పుష్పానికి, మల్లెకు, చంద్రునికి తెల్లని పూతవేయడంలా ఉంటుందని సుమతికి సూక్తులు చెప్పడం అనావశ్యకమని కవి తన అభిప్రాయం తెలిపాడు.

మెల్లఁగనే కొల్లలుగాఁ
జెల్లెడు సూక్తుల సుమతికిఁ జెప్పుట యెల్లన్
మొల్లకుఁ గ్రొమ్మెల్లెకు జా
బిల్లికిఁ దెల్లని మెఱుంగు వేయుట —4

కుమతి శతకం — ఇతి వృత్త విశ్లేషణ : కవి తన కావ్యంలో చెప్పదలచుకొన్న విషయాన్ని ఇతి వృత్తం లేదా వస్తువు అని అంటారు. ఇది కావ్యంలో ప్రధానమయింది. శ్రీ కొలకుల నారాయణరావుగారి కుమతి శతకం 1952 లో

ముద్రించబడింది. ఇందులో 112 పద్యాలున్నాయి, ఇవి అన్నీ కంద పద్య ఛందస్సులోనే రచింపబడ్డాయి. ఈ శతక పద్య మకుటం "కుమతీ" అనే సంబోధనాత్మక నామం ఇ ందులోని హితోక్తులు కొన్ని ప్రాచీన సంస్కృత గ్రంథాల్లోని లౌకిక న్యాయ లకు అనువాదాలు. శతకంలో శతకకర్త స్వీయానుభవాలు, లోకానుభవాలు, సమకాలిక సమాజ పరిస్థితులు, అభిరుచులు, ఉపదేశాలు వ్యక్తమవుతాయి. కుమతి శతకంలోని వస్తువును ప్రధానంగా భక్తి, రాజకీయాంశం, మానవధర్మం, విద్యా ప్రాముఖ్యం, సమాజ దుస్థితి, లోకనైజం అనే అంశాలుగా విభజించడానికి వీలుంది.

భక్తి : మానవులద్వారా లభించని సత్ఫలితం, సంరక్షణ మనశ్శాంతి, ముక్తి, దైవంమీద భక్తి కలిగి ఉండటంవలన సిద్ధిస్తుంది. కాబట్టి ప్రజలందరు దైవంపై భక్తి శ్రద్ధలు, విశ్వాసం కలిగి వుండాలి.

పరిత్రాణాయ సాధునాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అని

శ్రీకృష్ణ భగవానుడు ప్రవచించాడు. ఆ ప్రకారంగా ఈ కలియుగంలో తిరుపతి వేంకటాచలంపై శ్రీనివాసుడుగా అవతరించాడు. అలాంటి ఈ దైవాన్ని సేవించమని కవి ప్రబోధించాడు.

ఐశ్వర్యానికి స్థావరమైన ఏడుకొండలపై వెలుగొందుతున్నవాడు, భక్తుల్ని ప్రేమతో రక్షించేవాడు, దానగుణానికి వశమయ్యేవాడు అయిన శ్రీ వేంకటేశ్వరుని స్మరించుకోమని భక్తి బోధ చేశాడు.

శ్రీనిధులగు సప్తాద్రుల
పై నెలకొన్నట్టి దేవు భక్తుల నెల్లన్
మాపితముగ రక్షించెడు
దానవశున్ వేంకటేశుఁ దలఁపుము.........1

పద్యరచనను శ్రీకారంతో ప్రారంభించడం పూర్వకవి సంప్రదాయం ఆ ప్రకారంగానే ఈ కవి శుభప్రదమైన, సంపద్విలసితమైన శ్రీకారంతోనే శతక పద్యరచనను ప్రారంభించాడు. నన్నయ్య "శ్రీవాణీగిరిజాశ్చిరాయ" అనే శ్రీకారా శ్లోకంతో తన భారత రచనను ప్రారంభించాడు.

లోకంలో "ఆపద మొక్కులు సంపద మరపులు" అనే లోకోక్తి ప్రచారంలో వుంది. ప్రజలు సాధారణంగా కష్టాల్లో దైవానికి మొక్కుకొంటారు. సుఖాల్లో వాటిని తీర్చటం మరచిపోతుంటారు. అలాచేయకుండా ఆపత్కాలంలో మొక్కిన మొక్కుల్ని రేపుమాపు అంటూ నిర్లక్ష్యం, జాప్యం చేయకుండా వెంటనే వెళ్ళి మొక్కుల్ని తీర్చివేస్తే వరుసగా సత్ఫలితాలు సంభవిస్తాయని బోధించాడు.

ఆపద మ్రొక్కుల మ్రొక్కిన
రేపని మాపని తడయక యివ్వన బొమ్మా
యాపై మ్రొక్కును దీర్చినఁ
బ్రాపించును నీకు శుభపరంపర.......2

ఎన్ని సత్కార్యాలు చేసినా, ఎన్ని దానధర్మాలు చేసినా భగవంతుని స్మరించుకోకుంటే మనసు నిర్మలంకాదు. ఈ విషయాన్నే కవిగారు వ్యక్తం చేసారు. అభిప్రాయాలు ఎలాంటివైనా భక్తితో దైవాన్ని తలచుకొంటే వెంటనే మనస్సు పవిత్రమవుతుందని, అప్పుడు నీలాగా పుణాత్ముడు వర్ధిల్లబోడని భక్తి మహిమను తెలియజెప్పాడు.

భావన లెట్టివియైనను
దైవంబును భక్తితోడఁ దలంచిన తోడ్తోఁ
భావనమగు నీ చిత్తము
నీవలెఁ బుణాత్ముఁ డెందు నెగడఁడు.........111

భాగవతంలో— "శ్రవణం కీర్తనమ్ విష్ణోః
స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం
సఖ్యమాత్మ నివేదనమ్" అని

నవ విధ భక్తిమార్గాలు చెప్పబడ్డాయి. గడ్డిపరకన్నీ ఒకటై బలవంతమైన ఏనుగును కట్టివేసే విధంగా ఒక విధమైన భక్తి

మార్గంద్వారానే కాక అన్ని రకాల భక్తి మార్గాలద్వారా చేసే ప్రార్థన మనోబలంచేత ఫలవంతమవుతుందని ఉపమించి స్పష్టంగా వివరించాడు.

ఫలుగడ్డిపోచ లొకటయి
బలమగు నేమఁగుమ గట్టు భంగిని. బహు భ
క్తులు కలపి చేయు ప్రార్థన
ఫలవంతమ్మగు నెదంద బలమున.........112

ఈ విధంగా కవి శ్రీ వేంకటేశ్వరుని స్మరించుకోమని. మొక్కిన మొక్కుల్ని వెంటనే తీర్చివేయమని. దైవాన్ని తలచుకొంటే మనస్సు పావనం అవుతుందని అన్నిరకాల భక్తి మార్గాలతో దైవాన్ని ప్రార్థిస్తే ఫలితం వుంటుందని దైవ భక్తికి సంబంధించిన అంశాల్ని ఉపదేశించాడు.

రాజకీయాంశం :

రాజ్య పరిపాలనకు. ప్రజలకు సంబంధించిన అంశాలు. రాజకీయాంశాలు. "నా విష్ణుః ప్రథివీ పతిః" అని లోకోక్తి. పరిపాలకుడు దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసే విష్ణుమూర్తి లాగా వివేకవంతుడుగా. సాత్వికమూర్తిగా వుండాలని ఈ లోకోక్తి అర్థం ఇలా యుక్తాయుక్త వివేచనా జ్ఞానంతో పరిపాలించే అధికారి ప్రజాగౌరవం పొందుతాడు. కొంతమంది ప్రజలు అధికారులు చేసిన మేలును గుర్తించకుండా వారిపట్ల అవిధేయంగా వుంటారు. అలాంటి వారిని గమనించి కవి హితోక్తులు చెప్పాడు.

ప్రజల కష్టసుఖాల్ని గమనించి చూచి. ఆలకించి పరిపాలించే భూలోక దేవుడు. గొప్ప విద్యకు, సంపదకు నిలయమైన మండలాధిపుని(కలెక్టర్) ఎల్లప్పుడూ సేవించాలని బోధించాడు.

జనముల కష్టసుఖంబుల
గని. విని పాలనము సేయుక్ష్మాతల దేవున్
ఘనవిద్యా సంపన్నిధి
ననయము గొల్వుముర మండలాధీపు.........5

తమ దేశ క్షేమాన్ని. ప్రజల క్షేమాన్ని. తమ క్షేమాన్ని సమానంగా భావించే నిర్మల చిత్తులైన మంత్రుల్ని గౌరవించాలని తెలిపాడు.

తమ దేశ క్షేమంబును
దమ క్షేమంబును. ప్రజలకు దగు క్షేమంబున్
సమముగ నెంచెడు మంత్రుల
విమల స్వాంతులను గౌరవింపుము.........6

మన కష్టాల్ని తొలగించడానికి మన తరఫున సింహాసనం ఎక్కి ఉపన్యసించే సత్పురుషులైన శాసన సభుల్ని(ఎం.ఎల్.ఏ) విస్మారణంగా తిట్టడం పాపమని బోధించాడు.

మన బాధల వారింపగ
మన "తరఫున గద్దెనెక్కి మాటాడెడు స
జ్జనులన్ శాసన సభ్యుల
న నిమిత్తముగా దెగడుట యఘమగు.........7

తల్లి బిడ్డల్ని సంరక్షించుకొనే విధంగా అనేక రీతులుగా సామాన్య ఉద్యోగస్థులపట్ల ప్రవర్తించే తహశీల్దారును తిట్టకూడదని ఉపదేశించాడు.

చిల్లరయుద్యోగస్థుల
దల్లియు బిడ్డలకు బోలె దహశీల్దారుం
డెల్ల విధంబుల బ్రజలకు
జెల్లెడు వా డతని నిందసేయకు... ....8

ఈ విధంగా కవి ప్రజల కష్టసుఖాల్ని గమనించి పాలించే మండలాధిపతిని సేవించాలని. దేశ క్షేమాన్ని. తమ క్షేమాన్ని సమానంగా చూసే మంత్రుల్ని. తమ కష్టాల్ని తొలిగించడానికి వేదిక లెక్కి ఉపన్యసించే శాసన సభ్యుల్ని క్రింది ఉద్యోస్థుల్ని తల్లిలా ఆదరించే తహశీల్దారును దూషించకూడదని హితబోధ చేశాడు.

మానవధర్మం : మానవుడు ఉత్తమ గుణాల్ని కలిగి నియమబద్ధంగా గడిపినప్పుడే గౌరవం పొందుతాడు. క్రమబద్ధమైన నడవడిపట్ల తనకు తన సమాజంలోని వారికి శాశ్వత

సుఖాంతులూ లభిస్తాయి. కవి మానవ జీవితంలోని అనేక అంశాల్ని పరిశీలించి వారి సౌభాగ్యం కోసం కొన్ని మానవ ధర్మాల్ని తెలియజేశాడు.

కొంతమంది తమకు ఉన్నదానితో తృప్తి పడక ఇతరుల దగ్గర అప్పులుచేసి ఆడంబరంగా జీవిస్తుంటారు. అలాంటివారి నుద్దేశించి కవి అధికంగా అప్పులుచేసి ఆనందంగా పాయసాన్నంతిని సంబరపడటంకన్నా ఉన్నదానితోనే పచ్చడి మెతుకులు తినడమే మంచిదని బోధించాడు.

హెచ్చు ఋణమ్ములఁ జేయుచు
ముచ్చటఁ బరమాన్నము దిని పొంగుట కన్నన్
వచ్చిన జీతముతో దం
బచ్చడి యన్నం తినుటె భాగ్యము........9

ఇలాగే మరో పద్యంలో మాటిమాటికీ అప్పులుచేసి బాధ పడవద్దని "పోరిఁ బోరినప్పులను జేసి పొగులకు"........24 అని హెచ్చరించాడు. ఈ భావాన్నే అద్వైత మత ప్రవక్త శంకరాచార్యుల వారు భజగోవింద శ్లోకాల్లో "యల్లభసే నిజ కర్మోపాత్తం—విత్తంతేన వినోదయ చిత్తం" ధర్మబద్ధంగా తనకు ఎంత లభిస్తుందో ఆ ధనంతోనే మనసును ఆనందింప జేసుకోవాలని ఉపదేశించారు. పదకవితా పితామహుడు తాళ్ళపాక అన్నమాచార్యులు- "అప్పులేని సంసారమైనపాటేచాలు" అప్పు లేని సంసారమే సుఖం అని తెలిపాడు.

మనిషికి ప్రాణంకన్నా మానమే అధికమయింది ఆత్మాభిమానం వ్యక్తిత్వానికి సంబంధించింది. ప్రాణం పోయినా మానమే శాశ్వతంగా నిలిచి వుంటుంది. కాని కొంతమంది ఆత్మాభిమానం పోగొట్టుకొని ప్రాణంపై మమకారం పెంచు కుంటారు. అలాంటివారిని పరిశీలించి కవి - మానం సూర్య చంద్రులున్నంత వరకు శాశ్వతంగా నిలిచి వుంటుందని. ప్రాణం అశాశ్వతం కాబట్టి అత్యంత ధైర్యంతో ప్రాణాన్ని అయినా వదలి మానాన్ని రక్షించుకోమని ప్రబోధించాడు.

మానంబా చంద్రార్కము
ప్రాణమనిత్యంబుగాన పతి ధైర్యముతో
ప్రాణమునైనన్ విడిచి
మానము రక్షించు కొమ్ము మహిలో........1

తిమ్మన పారిజాతాపహరణంలో సత్యభామ పాత్రద్వారా—
"మానమె ప్రాణాధికంబు
మానమఖిల సమ్మానంబులకు మూలంబగు"
అని మానమే ప్రాణానికికన్నా గొప్ప అని. సకల గౌరవాలకు మూలమని తెలిపాడు.

కొంతమంది తమకు మృత్యువంటూ ఒకటుందని ముందు చూపు లేకుండా ప్రవర్తింటారు. ఐహిక భోగాలు. స్వార్థ సుఖాలు అనుభవిస్తూ సత్కార్యాల్ని వదిలేస్తుంటారు. అలాంటి వారి నుద్దేశించి కవి - ఈ శరీరం. ఈ ఐశ్వర్యం అశాశ్వత మైనవని. మృత్యువు ఎల్లప్పుడూ వెంబడిస్తూనే ఉంటుంది. కాబట్టి దానధర్మాల్ని వదలకుండా చేస్తుండాలని తెలిపారు.

కాయమనిత్యము శాశ్వత
మేయైశ్వర్యమ్ముః మృత్యువెప్పుడు నిన్నున్
డాయుచు నున్నది గావున
బాయక ధర్మం బొనర్ప వలయును........11

"లోకంలో" నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యంధర్మ సంగ్రహః" అనే శ్లోకం ప్రసిద్ధమయింది. ఈ శ్లోకార్థమే ఈ పద్యంలో వ్యక్తమయింది. శ్రీ శంకరాచార్యులు భజగోవింద శ్లోకాల్లో - మరణం ఆసన్నమైనప్పుడు లౌకికమైన వ్యాకరణాది శాస్త్రాలు రక్షించవని. గోవిందుని సేవించమని లోకానికి ఉపదేశించాడు.

"భజగోవిందమ్........ సంప్రాప్తే సన్నిహితకాలే నహి నహి రక్షతి"

దుర్జనీకరణే :

మనిషికి అనేక రకాలైన కష్టాలు వస్తుంటాయి. అలో

చించి తగిన నిర్ణయాలు తీసుకొని తదనుగుణంగా ప్రవర్తిస్తే కొంతవరకు వాటిని నివారించుకోవచ్చు.

మౌనంవలన జగదాన్ని, స్థిరమైన ధ్యానంవలన పాపాన్ని నిరంతరం కృషిచేయడంవలన దారిద్ర్యాన్ని, మెలకువగా వుండటంవలన భయాన్ని పోగొట్టుకోవచ్చని కవి సందేశ మిచ్చాడు.

కలహము మౌనముచే ని
శ్చల జపమునం బాతకంబు సంతతకృషిచే
నిల దుర్భిక్షము జాగ్ర
ద్బలమున భయమును దొలంపవచ్చును....2

ఈ పద్యాన్ని కవి—

"కృషితోనాస్తి దుర్భిక్షం జపతోనాస్తి పాతకం
మౌనేనకలహం నాస్తి జాగరితోభయః" అనే

శ్లోకానికి అనువాదంగా రచించాడు.

అనంతుడు భోజరాజీయంలో హితోపదేశ ఘట్టంలో ఆవు పులికి ఆహారంగా వెళ్ళబోతూ తన దూడకు—

"అడకుమ సత్యభాషలు
కూడకు కొఱగాని వాని కొంకకయొరులె
గ్గాడిన యెదురుత్తరమీ
జాతకు వినివిననివాని చొప్పునం జనుమీ" అని

హితబోధ చేస్తుంది. ఇందులో కవి ఆవు ద్వారా అబద్ధాలాడ కూడదని, దుష్టసాంగత్యం చేయకూడదని, ఓర్పులేక ఎవరైనా తప్పు మాట్లాడితే తిరిగి సమాధానం ఇవ్వవద్దని, విని విననివాడి లాగా వెళ్ళమని సందేశమిచ్చాడు.

సుమతీశతక కర్తకు పూర్వకవుల గ్రంథాల పరిజ్ఞానం విశేషంగా వుండటంవల్ల ఆయా కవుల గ్రంథాల్లోని శ్లోకాలకు, పద్యాలకు అనువాదాలుగా, అనుసరణలుగాను కొన్నిపద్యాలు రచించారు.

ధర్మం యొక్క ఔన్నత్యాన్ని కవి తెలియజేస్తూ— కుమారుడు కులాన్ని, చంద్రుడు రాత్రిని, సూర్యుడు పగటిని మాత్రమే ఆనందింపజేస్తే ధర్మం మాత్రం ముల్లోకాలకు వెలుగు నిస్తుందని, ఇది చాలా ఆశ్చర్యకరమని వివరించాడు.

పుత్రుండు కులమును జంద్రుండు
రాత్రిని సూర్యుండు పగటి రంజిలం జేయుం
జిత్రంబవురా! ధర్మం
బీ త్రైలోక్యమునకు వెలుంగిచ్చును....18

నీవు ధర్మాన్ని రక్షిస్తే అది నిన్ను రక్షిస్తుందని సూక్తి. "ధర్మోరక్షతి రక్షితః".

లోకంలో కొందరు కపట మనుషులు సాధురూపాలు ధరించి తిరుగుతుంటారు. కొందరు సాధువులైనా వికృతి వేషాల్లో కన పడుతుంటారు. వీరి అంతర్యాన్ని గుర్తించడం చాలాకష్టం. కాబట్టి తెల్లగా వుండేవన్నీ పాలుగాను, నల్లగా వుండేవన్నీ నీళ్ళుగాను భావించుకోకూడదని, పైకి కనిపించే బాహ్య వేషాన్ని చూచి మోసపోకూడదని కవి లోకంలో ప్రసిద్ధమైన సామెత ద్వారా వ్యక్తం చేశాడు.

నల్లని వెల్లను నీళ్ళుగ
దెల్లని వెల్లను బయస్సుతీరుగం దలంపం
జెల్లదు పైరూపముగని
బెల్లింపులపాలుగాకు పృథ్విని....23

ఆపదల్లో వున్నవారికి సహాయం చేయడం ఉత్తమ మానవ ధర్మం. క్షామం రోజుల్లో అన్నదానం చేయాలని, భూమి బాగా పండినప్పుడు స్వర్ణదానం చేయాలని, భయంతో యుద్ధ భూమి నుండి పారిపోకూడదని, మాటిమాటికి అప్పులు చేసి బాధపడ కూడదని కవి ఉపదేశించాడు.

కఱవున నన్నముం బెట్టుము
ధరపండిననాడు స్వర్ణదానం బిడుమా
వెఱచి రణభూమిం బాఱకు
పొరింబొరి నప్పులను జేసిపోగులకు....24

స్వర్ణదానం చేస్తే మరునటి జన్మలో మంచి మనస్సువస్తుందని పురాణవచనం.

మానవుడు తనలోని తప్పుల్ని తెలుసుకొని సవరించుకొని ప్రవర్తిస్తే గౌరవాన్ని పొందుతాడు. ఉన్నత స్థితిని చేరుకుంటాడు. ఎవరైనా శ్రేయోభిలాషులు దోషాలు ఎత్తి చూపించినప్పుడు వాటిని ఒప్పుకోవడం గొప్ప అని, వారిని కోపించడం పెద్ద తప్పు అని. తప్పుల్ని అంగీకరించి సవరించుకోవడం అభివృద్ధికి మార్గమని కవి ప్రబోధించాడు.

తప్పున్న నొప్పుకొనుడే
గొప్పసుమీ చూపువారిం గోపించుటపెన్
తప్పుసుమీ, యభివృద్ధికిఁ
జొప్పుసుమీ యద్ది యీవసుంధర....86

వేమన తప్పులు తిక్కించేవారు చాలమంది వున్నారని తప్పు లోకంలోని ప్రజలందరికీ వుంటుంది. ఎదుటి తప్పుల్ని లెక్కించేవారు తమ తప్పుల్ని తాము తెలుసుకోరని తప్పు పట్టేవారి తత్వాన్ని తెలియజేశాడు.

"తప్పులెన్నువారు తండోపతండంబు
లుర్విజనులకెల్ల నుండు తప్పు
తప్పులెన్నువారు తమతప్పులెరుగరు".
ఎన్నెన్నొ నెపములున్నను
సన్నజనులపైని దాడి సల్పకు వారల్
కన్నీరుగార్చిరేనియు
మన్నన బీనుఁగుం గూడమార్కొను....92

సంఘంలోని దురాచారాల్లో వరకట్నం ఒకటి. కొంతమంది వరకట్నం పేరుతో ధనం ఆశించకపోయినా దానికి సరిపోయే పాత్రలు, గృహోపకరణాలు మొదలైన కానుకల్ని ఆశించే స్వాముల్లాగా కాకుండా ఇతరులకు ఆశ్చర్యం కలిగించే లాగా ఖర్చులేకుండా దేవాలయంలో వివాహం చేసి సుఖంగా ఉండమని కవి పెద్దలకు సందేశమిచ్చారు.

వరకట్నము వలదంచును
నరికిన్ సరికాన్కలందు స్వాములవలెగా
కరుదుగ గుడిలో బెండిలి
ఖరిపి వ్యయం పడక కనుము సౌఖ్యము.... ... 107

ఈ విధంగా కవి - మానవులు ఏయే ధర్మాలు ఆచరించాలో ఏవేవి త్యజించాలో చెబుతూ అప్పులు చేయవద్దని, ప్రాణం కన్నా మానమే మిన్న అని, జీవితం అశాశ్వతమని, దాన ధర్మాల్ని చేయమని, బాహ్యవేషాలకు మోసపోవద్దని, ఆపదల్లో వున్నవారికి తోడ్పడమని, ఎలా ప్రవర్తించాలి, ఎలా ప్రవర్తించకూడదు, ఎక్కడ నివసించాలి, ఎవరెవరిని తిట్టకూడదు. ఎవరెవరు కొన్నింటికి అర్హులు, ఏలాంటివారితో స్నేహం చేయకూడదు, అనే అంశాల్ని గూర్చి, స్వధర్మాల్ని ఆదరించమని, పరోపకారం చేయాలని, జాతి, కుల భేదాల్ని చూపకూడదని, గుణపక్షపాతులై వుండాలని, పరస్త్రీ, పరధనాల్ని ఆశించకూడదని, పేదల్ని పీడించకూడదని, ధనవ్యయం తగ్గించుకోవాలని, ఇంకా వివేకవంతుని లక్షణాలు, శాంత గుణం ప్రాధాన్యం మొదలైన అంశాల్ని విశదీకరించారు.

విద్యాప్రాముఖ్యం ; మానవ మనోవికాసం కోసం, జ్ఞాన ప్రగతి కోసం విద్య అవసరం. పోతన భాగవతం- సప్తమ స్కంధంలో హిరణ్యకశిపుడు ప్రహ్లాదునికి విద్యాభ్యాసం చేయించే సందర్భంతో-

"చదవనివా డజ్ఞుండగు
చదివిన సదసద్వివేక చతురత కల్గున్
చదువగవలయును జనులకు
చదివించెద నార్యులొద్ద జదువుము తండ్రీ!

విద్య నేర్చుకోనివాడు అజ్ఞాని అవుతాడు. చదువుకుంటే రసజ్ఞత కలుగుతుంది. కాబట్టి మానవులు చదువుకోవాలి అని విద్యా ప్రాముఖ్యం తెలిపాడు. ఇంకా విద్య విలువకు సంబంధించి భర్తృహరి సుభాషితాల్లోను, మారద వెంకయ్య భాస్కర శతకంలోను మొదలైన అనేక గ్రంథాల్లో అంశాలు కనిపిస్తాయి. కుమతి శతకకారుడుకూడా విద్య అవసరాన్ని, విద్య విశిష్టతను విద్వాంసుని ప్రఖ్యాతిని పేర్కొన్నాడు.

(తరువాయి వచ్చే సంచికలో)

# సంపాదకీయం



జాషువా ఫౌండేషన్ లక్ష్యాలలో ముఖ్యమైన అంశం: సాహిత్య చర్చావేదిక. ఇందులో మొదటిది "ఆధునిక కవిత్వంలో సమతావాదం". రెండవది "తెలుగు నవల. సామాజిక దృక్పథం". డా॥ సినారె దక్షతలో జరిగినవీ రెండూను.

మొదటిదాంట్లో వక్తలు: వోల్గా, వరవరరావు, యస్వీ సత్యనారాయణ. వారు తమ ప్రసంగాలల్లో విషయంలోను, లోతులోనూ, విశ్లేషణలోనూ పటిష్టతలోనూ సైన్సు కాన్ఫరెన్స్‌లోలా అత్యంత ప్రమాణంగా మాట్లాడి సాహిత్య సభల్లో కూడా సశాస్త్ర ప్రమాణాలుంటాయని నిరూపించారు.

అదేరోజు సాయంత్రం వినబోయే బాలమురళి కచ్చేరిని మరపించేంతమధురంగా వున్నాయని నేనప్పుడే చెప్పాను. ఆ సాయంత్రం ఆయన కచ్చేరి చాలా గొప్పగా ఉంది. అయినా ప్రొద్దుటి సెమినార్లో ప్రసంగాలు- ఆ సాయంత్రపు బాలమురళి- సమ్మోహన మోహనను దాటి చెవుల్లో రింగుమంటూనే వున్నాయి! వక్తల ఎన్నికలో, సెమినార్ నిర్వహణలో- సినారె ప్రతిభకు- ఛాంగు భళా!

ఇక రెండవ సెమినార్: మృణాళిని తన అంశానికి పూర్తి న్యాయం చేశారు. ఆనందారామం చాలా విషయాలు చెప్పడానికి ప్రయత్నించడంలో ప్రసంగం ఫాస్ట్ ఫార్వర్డ్‌లా సాగింది. ఈ సారి వీరికి టైమ్ ఎక్కువివ్వాలి. మంజుశ్రీ మాట్లాడారు. వీరికి టైముచాలదని మరీ తక్కువ టైమ్ తీసుకున్నారు. అధ్యక్షులువారు తొందరపెట్టినట్లున్నారు. హేమలతా లవణంగారు కార్యక్రమం ఏర్పాట్లు ఎప్పటి లాగానే చక్కగా చేశారు.

అలపాటి రవీంద్రనాథ్, గోపి, వాకాటి పాండురంగారావు, వోలా. కుంటుంబరావు.

సి.యస్. రావు ఇంకా యిలాటి ఘనాపాటీలు ప్రేక్షకుల్లో వున్నారు. ఆ ప్రేక్షకుల్లో వక్తలకన్నా గొప్పవాళ్ళుంటారు కాబోలు!

అతి చేరువలో వున్న సెప్టెంబరు 28, జాషువాగారి 99వ జన్మదినోత్సవం శతజయంతి ప్రారంభోత్సవంగా వీలైనంత వైభవంగా జరపాలని జాషువా ఫౌండేషను సంకల్పం.

ఇందులో ఒక ఆడియో క్యాసెట్టు శ్రీ పొన్నాల రామసుబ్బారెడ్డిచేత (నెల్లూరు) పాడించి, శ్మశానవాటిక ముంటాజ్‌మహల్ పద్యాలతో ఆ రోజున విడుదల చేసే కార్యక్రమం ఒకటి, ఒక నృత్య రూపకం డా. ఉమారామారావుగారి దర్శకత్వంలో కూడా ఆరోజు ప్రదర్శించాలని వుత్సాహిస్తున్నాము.

ఈ 94, సెప్టెంబరు 28 లగాయితూ 95, సెప్టెంబరు 28వరకూ జాషువా శత జయంత్యుత్సవ వేడుకలు వైభవంగా జరపాలనీ, ఇంటింటా, ఊరూరా కాదుకానీ, ఆంధ్ర దేశపు అన్ని ముఖ్య పట్టణాల్లో, నెల నెలా కార్యక్రమాలు జరపాలని ఆశిస్తున్నాం. దక్షిణ భారత జ్ఞానపీఠ్ అవార్డుగా జాషువ అవార్డుకు కావల్సిన మూలధనం ఇక సమీకరణకు యేమాత్రం జాగులేక, ఉద్ధృతం చేయవల్సివుంది. అందులో మీ అందరి సహకారాన్ని అర్థిస్తూ, ఆశిస్తూ ముందుగా కృతజ్ఞతల్ని చెప్పుకుంటున్నాము.

కాలుష్యం పర్యావరణాన్ని దాటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాల్ని ముంచెత్తి మనందరి అంతరంగాల్ని మలినం చేస్తోంది. మన భావితరం ఉక్కిరిబిక్కిరి కాబోతోంది. ఈ రచ్చపుండు సాహిత్యానికి కూడా పాకుతోంది. దీనికిప్పుడే శస్త్ర చికిత్స చెయ్యకపోతే భావిజాతి మనల్ని క్షమించదు.

మనం, పిల్లలకివ్వాల్సింది ఆస్తులూ, అంతస్తులూ కావు: (మన మిస్తే కష్టపడి సంపాదించుకున్న ఆనందం వారికిలేకుండా పోతుంది. పాపం!)

మనం పిల్లలకివ్వాల్సింది కాలుష్యరహిత సాంఘిక వాతావరణం; పరిశుభ్ర సంస్కార సంపద! రండి! మనమంతా కలసి పనిచేద్దాం.

# మధుర శ్రీనాథుడు

—ఆచార్య జి. లలిత

భావకవిత్వం మహోజ్జ్వలంగా వెలుగుతున్న రోజుల్లో, దైవ్య హైన్య జీవుల మూకకావ్యాలను కూలంకషంగా అధ్యయనం చేసిన ప్రజాకవి జాషువా. దగావడ్డ సోదరిసోదరుల కన్నీటి చెమ్మల్నే కావ్యవస్తువులుగ స్వీకరించిన జనతా కవి జాషువా. సాంఘిక న్యాయసాధన నా జన్మ హక్కు అనే కృతనిశ్చయంతో ఈ ప్రపంచంలోనే మరొక ప్రపంచాన్ని, కావ్యలోకంలో కొత్తలోకాన్ని సృష్టించిన కవితాస్రష్ట జాషువా.

సమకాలీనుల సన్మానాలకు సమాదరణీయుడై ప్రజల హృదయాన్ని దోచుకొని వారి నీరాజనాలకు పాత్రుడైన మహాకవి జాషువా. ఆంధ్రదేశం నాలుగు చెరగులా ఆయనకు సన్మాన పరంపరలు, సత్కారాలు జరిగాయి. 1952వ సంవత్సరం ఫిబ్రవరి 17వ తేదీన తిరుపతి పుణ్యక్షేత్రంలో "కవితా సమితి" మహాకవి జాషువాను సన్మానించి "మధుర శ్రీనాథుడు" అన్న బిరుదును ప్రదానం చేసింది ఈ సత్కార్యాన్ని కవే యిలా ప్రస్తావించాడు :

"ఆనందంబున మధుర
శ్రీనాథుం డనెడు బిరుదుచేఁ నను స
న్మానించినారు తిరుపతి
లోనన్ వైష్ణవ కవీంద్రులుం బండితుఋన్"

(నా కథ, పుట 181, 1976)

పండిత ప్రకాండులు సదస్సు నేర్పరచి అందులో శ్రీనాథునికి, జాషువాకు గల సారూప్య, సాదృశ్యాల్ని షురస్కరించుకొని "మధుర శ్రీనాథ" బిరుదుతో సత్కరించడం, జాషువా సాహితీకృషిని విశ్లాఘిస్తూ నూటపహారు పద్యాలతో పద్యాభిషేకం చేయడం ఈ పురస్కారంలోని విశేషాలు.

జాషువాకవికి వున్న అనేక బిరుదుల్లో "మధుర శ్రీనాథుడు" అన్నది గణనీయమైనది. శ్రీనాథ జాషువాల మధ్య సాదృశ్యంకన్న తారతమ్యమే అధికం అనవచ్చు. నిజానికి వారిద్దరు ఉత్తర దక్షిణ ధృవాలు. శ్రీనాథుడు అగర్భ శ్రీమంతుడు, విద్వత్వంశజుడు. కవితాకాసారంలో పుట్టిన కమలం వంటివాడు. మరి జాషువా నిరుపేదల ఇంట పుట్టాడు. నిరక్షరాస్యుల మధ్య పెరిగాడు. పరిభవానలం మధ్య మలమల మాడిన మందారం వంటివాడు. ఒకరిది కొండవీడు. మరొకరిది వినుకొండ. ఇద్దరు పలనాట పర్యటించిన ప్రముఖ కవులు. శ్రీనాథుడు రాజపోషణల నందు కొన్న కవిసార్వభౌముడు. జాషువా ప్రజాదరణను పొందిన నవయుగ కవిచక్రవర్తి.

అయితే శ్రీనాథుడు ఎలాగ పూర్వకవుల ప్రసిద్ధ ఫణుతుల్ని అదవెరిగి తన కవితలో కదను త్రొక్కించినా తనదైన ఒక అపూర్వ మార్గాన్ని

నిర్మించుకున్నాడో అలాగే జాషువా కూడ తనదైన ఒక స్వీయ కవితాముద్రను సృష్టించాడు. ఎన్నో పూలతేనెలు జుంటితేనెలో ఉన్నా ఈ పాకంమాత్రం ఈ తేనెటీగదే అని చెప్పగల సీస పద్య రచనలు వీరివి. పద్యం నడకలో శ్రీనాథుని ముద్ర జాషువాపై నిర్దిష్టంగా ఉన్నవి. గొలుసులా సాగే మాటలమధ్య, సమాసాలమధ్య, పాదమధ్యంలో, ప్రాయికంగా యతిస్థానంలో చిన్న సంబోధన విసరడం వీరిద్దరి రచనల్లో కనిపిస్తుంది. శ్రీనాథుడు "పక్షి సేయు దాక్షిణ్యమున్" అంటే జాషువా "తబిసి పిట్టా నీకు మేలయ్యెడున్" అని అంటారు. "అంధరత్నా! నీ యోగమమున స్వరపట్టణ మానందభరితమయ్యె" (ఖండకావ్యం 1 భా. పుట 85, 1977), "తెలుపగదవమ్మా! నమ్మగన్న తెలుంగుతల్లి" (పై ఖండిక పుట 55)

అరబ్బీ ఫారసీక పదాలు, ఉర్దూ మాటలు విరివిగా ప్రయోగించడంలో ఈ కవులిద్దరూ కవల బిడ్డలే. గులాము, కుల్లా, హాజరము, ఖుసి ఇత్యాది పదాల్ని శ్రీనాథుడు ప్రయోగించాడు. జాషువాజనం అనునిత్యం వాడే ఉష్కుక్కు, నగిషీ, హయాం, గలభా, షరాబు, కులాస, నసీబు, తయారు, దర్జా, పసందు, కోనకిస్కాగాడు వంటి పదాల్ని ఉపయోగించాడు.

ఈ ఇద్దరు కవులు నిర్భీకంగ తన ప్రత్యర్థుల్ని ఎదుర్కొని విజయ పతాకల్ని ఎగురవేశారు. శ్రీనాథుడు ప్రౌఢ దేవరాయల ఆస్థానంలో గౌడ డిండిమ భట్టు కంచుఢక్కను పగులగొట్టాడు. జాషువా కాకినాడ సభలో తన్ను చిన్నిచూపు చూచినవారి "గవ్వకు సాటిరాని" ....అని రొమ్ము విరుచుకుంటూ విజయనివాదం చేసాడు.

రాజ్యాలు జీర్ణించినా, భోజ్యాలు పూజ్యాలయినా శ్రీనాథుడు స్వీయకవితాసామ్రాజ్యాన్ని నిర్మించి అందులో శివంకరంగా శృంగారానికి స్వర్ణాభిషేకం చేశాడు. ఎందరు సత్కరించినా, ఎన్ని అడ్డంకులు ఎదురైనా జాషువా తన కవితారామంలో కరుణరసానికి కనకాభిషేకం చేశాడు. ఒకరిది ప్రౌఢకవిత, మరొకరిది మధురకవిత.

జీవితమంతా అందలాల్లో అడుగులకు మడుగులొత్తించుకొని అష్టైశ్వర్యాలు అనుభవించినా అవసానదశలో అవస్థలపాలైనవాడు శ్రీనాథుడు. పుట్టినదాదిగ పేదరికంతో, కులమత వైషమ్యాలతో కుమ్ములాడి, అగచాట్లుపడి అవసానదశలో అందరి మన్ననలకు పాత్రుడైనవాడు జాషువా.

సామాజిక స్పృహతో విశ్వజనీనతను సమ్మిళితం చేసి ఉత్తమ కృతుల్ని వెలువరించిన యీ మధుర శ్రీనాథుడు తెలుగువారికందిస్తున్న సందేశం.

కోటానుకోట్ల నరులోక
మేటి జగన్మాతృసుతులు మిత్రులని మదిం
బాటింపు మీ సువార్తన్
చాటింపుము జీవితంబు సార్థక్యమగున్.

# అసహజ

డా. సంజీవదేవ్

ఉన్నదాన్ని వున్నట్లు గ్రహించటం, గ్రహించినదాన్ని నట్లు రూపొందించటం, రూపొంచిన దాన్ని రూపొందించి నట్లుగా ఇతర్లు దాన్ని ఆస్వాదించటం సాంస్కృతిక రంగుల్లో జరుగుతుంటే మానవునిలోని సృజనాత్మకత ప్రగతికి దూరమై సహజరూపంలో ఎక్కడి దక్కడే స్థగితమైపోయేది.

కాని మానవజాతి మేలుకోరి సృజన అనేది అవిధమైన సహజ స్థితిలో వుండి పోక అసహజంలోకి రూపాంతరం పొందుతూ పరిణమించ సాగింది. కళాకారుని కల్పనా నైపుణి వలన.

మానవుడు జననం మొదలు మరణం వరకు అసహజ జీవితం కాని గడపాలసిందే. సహజ జీవితం గడపలేడు. శిశవు జన్మించినపుడు సహజంగా శరీరంమీద బట్టలుండవు. తరువాత బట్టలు ఏర్పరుస్తారు. అప్పటినుంచే సహజత్వం భంగం అవుతుంది. మానవుడు తన ఆకలి తీర్చుకోవానికి సహజరీతిలో అయితే ప్రకృతితో దొరకిన పచ్చి పదార్థాలను తిని సంతృప్తి చెందాలి, కాని అవిధంగా జరగక పదార్థాలను వండి తింటున్నాడు.

అంటే మానవుడు సహజరీతిలో జీవించలేడు. సహజ జగత్తంతా ముడిపదార్థం. ముడిపదార్థం మార్పు చేయబడింది ఉపయోగ పడదు. అంటే మానవుడు సహజత్వంలో జీవించలేడు. ఉండటం అనేది సహజం, కావటం అనేది అసహజం. ఉండటం (Being) కావటం (Becoming) లోకి రూపాంతరం చెందాలి.

అసలు ఒక జీవి పెరుదలంతా అసహజత్వం మీదఆధారపడి వుంటుంది. ఇక మానవ జీవితానికి ఈసత్యం ప్రత్యేకంగా వర్తిస్తుంది. అందులో కళారంగానికి ఈ సత్యం మరీ ప్రత్యేకంగా వర్తిస్తుంది. కళలోని రూపకల్పనంతా కూడ అసహజమైందే. సహజ రూపాన్ని అసహజ రూపంలోకి రూపాంతర పరిస్తేనే కాని వాస్తవ రూపం రసరూపాన్నిదాల్చి కళాఖండంగా ప్రత్యక్షంకాదు.

ప్రకృతివేరు. కళవేరు. ప్రకృతి భౌతికసృష్టి, కళ మానవసృష్టి. ప్రకృతిలోని సహజరూపాలను ఎట్లావుంటే రమ్యంగా వుంటుందో అట్లా మార్చికళారూపాలుగా సృష్టిస్తాడు మానవుడు. అంటే వాస్తవ సృష్టికి కొంత కల్పనను కలిపి వస్తువునుకాని, జంతువునుకాని, మనిషిని కాని

సృజనాత్మక శోభలోకి ప్రత్యక్ష పరుస్తాడు; ఇటువంటి సృజన చేసే మానవుణ్ని కళాకారుడంటారు.

ఒక్కమాటలో చెప్పాలంటే కళాకారుడు సృష్టిని ప్రతిసృష్టి చేస్తాడు,- మాటను కవితలోకి, నాదాన్ని సంగీతంలోకి, గతిని నర్తన లోకి, శిలను శిల్పంలోకి, రంగును చిత్రంలోకి ప్రతిరూపిస్తాడు.కవి, సంగీతకారుడు, నర్తకుడు, శిల్పి, చిత్రకారుడు మొదలైన వారంతా కళాకారులే. వీరంతాకూడా సహజ వాస్తవాలను అధిగమించి తమతమ కళా రంగాల్లో అసహజత్వాలను సృష్టించేవారే.

కవి ఒక సుందర అస్తిత్వాన్ని వర్ణించాలని వచ్చినప్పుడు సహజమైన మాటల ద్వారా దాన్ని వర్ణిస్తే రసపుష్టిని సృష్టించలేడు. కొన్ని అసహజమైన ప్రయోగాల ద్వారాగాని తాను భావించిన శోభను సృష్టించలేడు.

సంధ్యాకాశాన్ని వర్ణించాలని నప్పుడు ఆయాకాశం ఏది కాదో అది అని అంటాడు కవి.'సంధ్యాకాశం ఒక అరుణ సముద్రం'అంటాడు. ఆకాశం ఆకాశమే కాని సముద్రం ఎట్లా అవుతుంది? కాని తన 'రూపకం' అనే అలంకార ప్రయోగం ద్వారా ఆకాశాన్ని సముద్రం చేస్తాడు. వాస్తవంలోఒకటి ఏది కాదో తన సృజనాత్మక పద ప్రక్రియద్వారా దాన్ని అది చేస్తాడు. అందుకే సమాజానికంటే అసహజానికి అంత విలువ. ప్రకృతి కంటే వికృతికి కూడ.

అయితే సహజజగత్తును సహజ పదాలద్వారా అభివ్యక్త పరిస్తే అది కవిత కాదా? ఎందుకు కాదు? అవుతుంది. కాని దాని ప్రభావం బలీయంగా వుండదని, సంధ్యాకాశం ఎర్రగా వుంది. అని అన్నప్పుడు అందులో విశేషం ఏమీ తట్టదు. పిల్లలు మొదలు పెద్దల వరకు నిరంతరానుభవమే ఆ వాస్తవ దృశ్యం. ఆవిధంగా కాక దాన్ని ఒక అరుణ సముద్రం అన్నపుడు అది అసహజ ప్రయోగమైనందున ఇంకా ఎక్కువ ప్రభావాన్ని చూపుతుంది.

ప్రతి కళలోను రెండు విధాలుగా వుంటుంది. రచన అనేది, అనుకరణ, సృజన అని. బాహ్యరూపాలకు మార్పు లేకుండా వున్నది వున్నట్లు ప్రతి రూపాలనివ్వటం అనుకరణ; బాహ్యరూపాలను మార్చి కాని, లేక పూర్తిగా బాహ్యరూపాలకు సంబంధించకుండా స్వతంత్ర రూపాలను ప్రత్యక్ష పరిస్తే కాని అది సృజన అవుతుంది.

సంధ్యాకాశం ఎర్రగా వున్నదని కవి అంటే అది అనుకరణ మాత్రమే అవుతుంది; కారణం ఈ వాక్యంలో కవి సంధ్యాకాశాన్ని సంధ్యాకాశం అనే అన్నాడు కాని మరొకటని అనలేదు. ఆ విధంగా కాక సంధ్యాకాశాన్ని (అరుణ సముద్రం) అన్నప్పుడు సంధ్యాకాశాన్ని మరొకటి చేశాడు.

అందుకే అనేది, మొదటిది అనుకరణ, రెండవది సృజన అని, వాస్తవానికి ఆదిలో ప్రతి కళా కూడా అనుకరణలోనే ప్రారంభమయింది. సృజన లోకి పరిణతి చెందింది. కనుకనే కళలో అనుకరణ దుర్బలమైంది, సృజన బలీయమైంది. ఈ విషయాన్ని గురించే సంజీవదేవ్ మరోమాటల్లో ఈ విధంగా అభివ్యక్త పరిచాడు

"Imitation is limitation while creationis Liberation" అని. అనుకరణ అనేది బంధన, సృజన అనేది స్వేచ్ఛ.

అనుకరణ సహజచర్య, సృజన అసహచర్య. అనుకరణ కంటే సృజన ఎక్కువ ఉన్నతమైంది కనుక సహజం కంటే అసహజం ఎక్కువ విలువకలది, ప్రత్యేక అన్ని కళావిభాగాల్లో.

ఈ అసహజ రీతి మిగతా కళలన్నిటిలోకీ చిత్రకళలో ఎక్కువగా రాణిస్తుంది; కారణం చిత్రకళ ప్రధానంగా రూపానికి రంగుకూ సంబంధించింది కనుక. ఇక్కడ ప్రకృతికీ చిత్రకళకూ మిగతా వాటి కంటే ఎక్కువ దగ్గర సంబంధం వుంటుంది కనుక.

ప్రకృతిలోని ఒక ముళ్ల చెట్టు నిండా గుబురుగా ఆకులు దట్టంగా పెనవేసుకొని వుంటాయి. దాన్ని చూస్తుంటే ఆ సహజ రూపం ప్రేక్షకుడిలో ఏ హృదయస్పందననూ కలిగించదు. చిత్రకారుడు ఆ చెట్టును అనుకరించి ఒక చిత్రాన్ని వేస్తే దాన్ని చూచిన ప్రేక్షకుని హృదయంలో కూడ ఏ ప్రతి స్పందనా కలిగించదు. ఎందుకంటే అది సహజ రూపం కనుక.

కాని చిత్రకారుడు తన చిత్రంలో ఆచెట్టును కొంత అసహజ రూపంలో, అంటే అది ఒక ప్రక్కకు వరిగిపోయి, కొన్ని కొమ్మలు విరిగిపోయి, ఆకులు రాలిపోయి, ముళ్లు ముందుకు పొడుచుకు వచ్చి ఎండిన మోడు రూపంలో ఒక విధమైన బూడిదరంగు, తెలుపురంగుల్లో చిత్రిస్తే సామాన్య మానవుల కంతగా నచ్చకపోయినా! సహృదయుల హృదయాలను ఎంతగానో రాగరంజితం చేస్తుంది. చిత్రకళలో ఆ సహజ రూపానికి అంత వైశిష్ట్యం వున్నది!

ఒక విషయం మాత్ర మరిచిపోగూడదు. ఈ అసహజత్వం కళారంగాల్లో కలిగించే శ్రేయాన్ని మానవుని వ్యావహారిక జీవితంలో కలిగించదు. వాస్తవ జీవితపు దైనందినవ్యవహారాల్లో సహజ రీతియే చాలా అవసరం, అసహజ రీతి అపదలను సృష్టిస్తుంది.

శరీరం కాని మనసు కాని ఎంత సహజంగా వుంటే వ్యక్తికి కాని, సమాజానికి కాని అంత మేలు చేస్తాయి.

వ్యావహారిక జగత్తులోకి అసహజాన్ని ప్రవేశించకుండా జాగ్రత్తపడాలి.

కళారంగాల్లో మాత్రం అసహజం దాని గొప్పతనాన్ని అది కలిగివుంది.



# ఆధునిక మరాఠీ సాహిత్య యుగకర్త 'నారాయణ్ సుర్వే'

'మనిషిని మనిషిగా చిత్రించండి. జీవితాన్ని జీవితంగా వ్యక్తీకరించండి. సమాజాన్ని, సామాజిక వాస్తవికతనూ వక్రీకరించడం సాహిత్య ప్రక్రియలకు, కళారూపాలకూ న్యాయం కాదు. వాస్తవికతను సుందరంగా పునస్సృష్టి చేయడం సామాజిక చైతన్యకారుల బాధ్యత' అంటూ యువ రచయితలకు ప్రబోధిస్తున్న 'నారాయణ సుర్వే' జీవితం, వ్యక్తిత్వం, సాహిత్యం మూడు పీడిత ప్రజలకోసం అంకితం చేశారు.

యావత్ భారతీయ సాహిత్యంలోనే తను పుట్టినకులం, మతం, ప్రాంతం, భాష ఏమిటో త్రికరణ శుద్ధిగా తెలియని ఏకైక మహా రచయిత నారాయణ సుర్వే.

గ్రాంధిక సంస్కృత మిశ్రమ మరాఠీ సాహిత్యాన్ని ప్రజల వ్యావహారిక మరాఠీ సాహిత్య దిశకు నడిపించిన ఆధునిక మరాఠీ సాహిత్య యుగకర్త 'నారాయణ సుర్వే'

ఏ కులమో, ఏ మతమో, ఏ ప్రాంతమో తెలియని ఒక మాతృమూర్తి 1926 వ సంవత్సరం అక్టోబర్ రెండవ వారంలో ఒక మగ శిశువుకు జన్మనిచ్చి, ఆ పసికందును బొంబాయి మహానగరంలోని ఒక చెత్త కుప్పలో పారేసిపోయింది. 'గంగారాం సుర్వే' అనేమిల్లు కార్మికుడు ఆ పసిబాలుడ్ని తన ఇంటికి తీసుకెళ్ళి పది సంవత్సరాల పాటు పెంచి, పోషించాడు. కాశింబాయి, గంగారాం సుర్వేల పెంపుడు కొడుకుగా పెరిగిన ఆ బాలుడే 'నారాయణ సుర్వే' ! పీడిత దళిత శ్రామిక కుటుంబంలో నికృష్ట పేదరికాన్ని జీవితానుభవంగా పొందిన 'సుర్వే' సాహిత్యంలో అనివార్యంగానే దళితజన పక్షపాతం, పీడిత వర్గ దృక్పథం అంతర్వాహిములుగా ప్రవహిస్తుంటాయి.

---

**డా॥ ఎస్వీ. సత్యనారాయణ**

---

దాదాపు పదిసంవత్సరాల వయస్సు 'సుర్వే' కు వచ్చేదాకా పెంచిన 'గంగారాం సుర్వే' మిల్లుఉద్యోగ విరమణచేసి, తన స్వగ్రామానికి వెళ్లిపోతూ, 'నారాయణ సుర్వే' ను బొంబాయి మహానగర ఫుట్‌పాత్‌లకు బహుమానంగా ఇచ్చి వెళ్లాడు. ఫలితంగా 1936 నుంచి 1943 దాకా దాదాపు 7 సంవత్సరాల ఫుట్‌పాత్ జీవితానుభవం 'సుర్వే' సాహిత్యానికి ప్రజా సాన్నిహిత్యాన్ని సంతరించిపెట్టింది.

1936 నుండి 1957 మధ్యకాలంలో బొంబాయిలోని గాద్రిజ్ కంపెనీలో కార్మికుడిగా, బట్టలమిల్లులోకార్మికుడుగా, బొంబాయిఓడరేవులో డాక్ వర్కర్‌గా, మున్సిపల్ కార్పొరేషన్‌లో అటెండర్‌గా పని చేసారు.

స్వంత కష్టార్జితంపై ఆధారపడుతూ 1957 నాటికి ప్రైమరీ స్కూల్ ఫైనల్ పూర్తి చేసిన నారాయణసుర్వే1959 లో 'Primary Teachers Certificate కోర్సు పూర్తి చేశారు. 1961లో 'మున్సిపల్ ప్రైమరి టీచర్'గా నియమితులయ్యారు.

1942 నాటి 'అగష్టు విప్లవం' లో శ్రీ సోలీ బాట్లీవాలా నాయకత్వంలో 'Peoples Volunteer Brigada' లో వలంటీర్ గా భారతజాతీయోద్యమంలో పాల్గొంటూ మొట్టమొదటి సారిగా 'గవాలియర్ టాంక్ మైదానం'లో గాంధీజీ ఉపన్యాసం విన్నారు. ఇప్పుడా మైదానాన్ని 'ఆగష్టు క్రాంతి మైదానం' అని వ్యవహరిస్తున్నారు. 1942 'క్విట్ఇండియా' ఉద్యమ సందర్భంగా ఏర్పాటయిన ఆ సమావేశంలో పాల్గొన్న సభికులపై జరిగిన 'లాఠీచార్జి'లో మొదటి పోలీసు లాఠీదెబ్బ తిన్నారు. దానికి ప్రతీకారంలో జేబుల్లో రాళ్ళుని పుకొని బ్రిటీషు ప్రభుత్వ ఆస్తులను ధ్వంసం చేసే ఉద్యమంలో పాల్గొన్నారు. 1942 – 43 మధ్యకాలంలో బొంబాయిలోని వాహిమ్‌లో ప్రముఖ ట్రేడ్ యూనియన్ నాయకులు శ్రీ హమన్ సామన్ Kohinoor mill అజ్ఞాత కార్యక్రమాలకు సహకరించారు. ట్రేడ్‌యూనియన్ రంగంతో పాటు 'కమ్యూనిష్టు పార్టీ' స్థానిక కార్యాలయంలో కార్యాలయ నిర్వహణబాధ్యతలు స్వీకరించడం ద్వారా లెనిన్ మార్క్స్, జీవితవిశేషాలు, విప్లవ వదజాలపరిచయం, వామపక్ష సిద్ధాంతాలుతోపరిచయం లభించింది. 1944లో శ్రీ నారాయణ సుర్వే 'కమ్యునిస్టుపార్టీ' రెడ్‌గార్డ్‌గాపనిచేశారు. శ్రీ.పి.సి.జోషి పార్టీ కార్యదర్శిగా ఉన్న రోజుల్లో 'రాజ్‌భవన్' పేరిట పనిచేస్తున్న కార్యాలయంలో పని చేస్తున్న రోజుల్లోనే నాయకత్వం అతన్ని మిల్లుకార్మికుల సమ్మె'లో పాల్గొనడానికి పంపింది. వీధి సమావేశాల్లో సుర్వే ఉపన్యాసాలు విని పరిచయమై,ప్రభావితమైన 1948లో కృష్ణాబాయిని ప్రేమించి, పెళ్లి చేసుకున్న నారాయణ సుర్వే 1956లో తన మొదటి గీతం "డోంగరిశేత మాధురి" రచించారు.

అమర్‌షేక్, అన్నా భావ్‌సాఠె నడిపిన "కళా పథక్" .P.T.A మహారాష్ట్రశాఖ కళాకారులు ఆ గీతాన్ని ప్రజలలో ప్రచారం చేశారు. ఫలితంగా 'His Masters Voice'వాళ్ళు ఆ గీతాన్ని గ్రాంఫోన్ రికార్డ్‌గా రికార్డ్ చేశారు. 1962 లో "ఐసా గామిబ్రహ్మ" (నేను బ్రహ్మ అంశాన్ని అనే శీర్షికతో వెలువడిన సుర్వే మొదటి కవితా సంకలనం మహారాష్ట్ర సాహిత్య అకాడమి అవార్డు పొందింది. 1966లో "మఝెవిద్యాపీఠ్" (My University) కవితా సంకలనం ప్రకటించిన నారాయణ సుర్వే కవిత్వంలో జీవన వేదాంతం, జీవన పోరాటం ప్రధానాంశాలుగా ప్రతిధ్వనిస్తాయి. ఈ సంకలనానికి "మహారాష్ట్ర సాహిత్య పురస్కార్' "సుర్‌సింగర్" కళా అకాడమి వారి "నరసింహమెహతా అవార్డు" 'సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు' లభించడంతో పాటు దేశం లోని అనేక విశ్వవిద్యాలయాలు ఈ సంకలనాన్ని తమ మరాఠి

శాఖల్లో పాఠ్యపుస్తకంగా నిర్దేశించారు. 1966-74 మధ్యకాలంలో శ్రీ నారాయణ సుర్వే రాసిన కవిత్వం 'జాహిర్‌నామా' అంటే 'మేనిఫెస్టో' పేరిట ప్రచురించబడింది. ఇంగ్లీషులోకి అనువదింప బడిన వీరి కవితలు On pavements of the life. శీర్షికను సంకలనంగా వెలువడింది. 1982 లో శ్రీ సుర్వే కవితా సంకలనం "సనద్ అంటే "Declaration or Proclamation" శీర్షికన వెలువడి, ఆధునిక మరాఠి సాహిత్యంలో నూతన కవాటాలు తెరిచింది. 1984లో బొంబాయి మున్సిపల్ కార్పొరేషన్ వారిచే ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు పొందిన శ్రీ నారాయణ సుర్వే 1984 లోనే మహారాష్ట్ర రాష్ట్ర ప్రభుత్వ సాహిత్య సాంస్కృతిక మండలి వారిచే పది వేల రూపాయల గౌరవ పురస్కారాన్ని పొందారు.

ఉర్దూ భాష, సాహిత్యాలపై ఉన్న ప్రేమతో కష్టపడి ఉర్దూ భాషను నేర్చుకొని అనేక గ్రంధాలను ఉర్దూ నుండి మరాఠీ భాషలోనికి అనువదించాను. వాటిలో ప్రముఖంగా పేర్కొనదగినవి- 'కిషన్ చందర్ 'గారి' 'తీన్ గుండే ఔర్ సాత్ కథాయేఁ' (కథలు) దాదర్‌పూల్ కేబచ్చే' (నవలిక), అనేక ప్రేంచంద్ కథలు ముఖ్యమైనవి.

1973 లోను, 1976లోను ఆఫ్రోఏషియాన్ రైటర్స్ ఆహ్వానం మీద, సోవియట్ యూనియన్ రచయితల సంఘం ఆహ్వానం మీద సోవియట్ సందర్శించిన సుర్వే 1985 లో మారిషస్ వెళ్లారు. అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం ఉపాధ్యక్షులుగా, ఇండియన్ పీపుల్స్ థియేటర్స్ అసోసియేషన్ IPTA ఉపాధ్యక్షులుగా పదవీ బాధ్యతలు నిర్వహిస్తున్న ఆ నారాయణసుర్వే 'ఆదివాసీ లేఖక్‌సంఘ్' 'జనవాద లేఖక్ సంఘ్,' 'స్త్రీ విముక్తి వాదీ లేఖక్ సంఘ్' మొదలైన రచయితల సంఘాలతోను, దళిత, ఆదివాసీ, గ్రామీణ, స్త్రీ విముక్తి వాదీ జనవాదీ లేఖక్ సంఘ్‌ల సమాఖ్యను రూపొందించడంలోనూ, దానిని ముందుకు నడపడంలోను ప్రధానమైన భూమికను నిర్వహిస్తున్నారు.

సాహిత్య రంగంలో విభిన్న ప్రవాహాలను ప్రవహించ నివ్వాలి. చర్చల ద్వారా, అభిప్రాయాల ఆదాన ప్రదానాల ద్వారా, భావ వినిమయం ద్వారా ఈ ప్రవాహాలన్నీ సామాజిక ప్రయోజనాన్ని, సామాజిక న్యాయాన్ని, సమ సమాజ నిర్మాణాన్ని కాంక్షిస్తూ ఒక సమాఖ్యగా సమైక్య కృషిని సల్పాలి అనే దృఢ సంకల్పంతో సృజనాత్మక సాహిత్య సృష్టినీ, క్రియాశీల సంస్థాగత కార్యకలాపాలను ద్విముఖంగా అజేయంగా నిర్వహిస్తున్నారు.

గుజరాతీ భాషలో 'నారాయణసుర్వే-నీకవిత' పేరిట ఒక సంకలనం, Russian భాషలోసుర్వే కవితానువాదాల సంకలనం, వివిధ జాతీయ, అంతర్జాతీయ భాషల్లో సుర్వే కవితల అనువాదాలు వెలువడ్డాయి.

1960 దశకం నుండి మరాఠీ సాహిత్యంలో రూపంలోనూ, భాషలోనూ, వస్తువులోనూ, వ్యక్తీకరణలోను గొప్పసంచలనాన్ని సృష్టించడమేకాక, గుణాత్మకమైన, మౌలికమైన పరిణామాన్ని శ్రీనారాయణసుర్వే సాహిత్యం తీసుకురావడం ద్వారా ఆధునిక మరాఠీ సాహిత్య పథ నిర్దేశకుడిగా శ్రీ సుర్వే విశిష్టమైనస్థానాన్ని సంపాదించుకున్నారు. లబ్ద ప్రతిష్టులైన 51మంది ఆధునిక మరాఠీ రచయితలు ఆ సుర్వే జీవితాన్ని, వ్యక్తిత్వాన్ని, సాహిత్యాన్ని విభిన్న కోణాల్లో విశ్లేషిస్తూ రాసిన వ్యాసాల సంకలనం 'సర్వ సుర్వే' హిమాలయ పర్వతాన్ని అద్దంలో చూపే ప్రయత్నం చేసింది.

# వెళ్ళిపోదాం పద — అరిపిరాల విశ్వం

వెళ్ళిపోదాంపద
　　చరిత్ర మనని వెతకలేని చోటుకి.

వెళ్ళిపోదాం పద

　　ధరిత్రి మనల్ని కులంపేర, మతంపేర, జాతిపేర
　　గుర్తుపట్టి అవమానించ లేని చోటికి
　　పురాతన చరిత్రలో తృప్తిపడి గర్వించే
　　దురదృష్టం అంటని చోటుకి.

గడుస్తున్న కాలానికి—కన్నీళ్ళు మారుపేరు కానిచోటుకి.
భయంలేని భవిష్యత్తు అవతలి ఒడ్డుకి
నిన్నుచూసి నీ ధైర్యం చూసి
దేవుడు దుఃఖించని చోటుకి.
ఒకరితో ఒకర్ని పోల్చుకొని పొర్లి పొర్లి ఏడవని చోటుకి.

　　చివరికి మిగిలే చావు ఒక్కటే సత్యమై
　　చంపుకోవటం నిత్యం కాని చోటుకి
　　చెట్లక్రింద ఉన్నా—స్వేచ్ఛకీ- సుఖానికీ బాధలేనిచోటుకి.
　　మేడల్లో ఉన్నా-మనసు ఓ చుట్టు గుడిసె కాని చోటుకి.
　　కొత్త ఊపిరికీ-దేవుడికీ పేరు పెట్టని చోటుకి.

అప్పుడే పుట్టిన పాపాయి భవిష్యత్తుని
కన్నవాళ్ళ ధైర్యంతో పాటు బజారులో వేలం వేయిలేని చోటుకి
కలలు కనే కళ్ళకి కన్నీళ్ళే వరంకాని తీరాలకి.
వెళ్ళిపోదాంపద చరిత్ర మనని వెతకలేని చోటుకి.

మనిషిని మనిషి వేటాడి
సజీవ సమాధులు కట్టని చోటుకి.
కాలానికి ముందు మాట–నిజం ఒక్కటే అయిన భూమికి.
సిద్ధాంతాల చింపిరి తలల విలయ నాట్యం లేని చోటుకి.

ప్రవక్తల్ని, కవుల్ని, ఋషుల్ని
సిలువపైకి ఎక్కించనిచోటుకి.
ప్రతిభని చాతకానితనం అవమానించి
పాతిపెట్టలేని పవిత్ర ధరిత్రికి.

మనిషిపై–దేవుడిపై–నిజంపై పెంచుకున్న నమ్మకం.
ప్రేమగా పరిఢవిల్లి–ప్రవేశానికి
మనిషి–మనిషిగా–మనిషి దివ్యుడుగా
బ్రతకగల మంచిచోటుకి.
వెళ్ళిపోదాంపద.

నీగుండె గుడి అయిన చోటుకి
చరిత్ర నిన్ను అవమానించని చోటుకి
వెళ్ళిపోదాంపద.

తన రాష్ట్రము చెడ వచ్చిన
నని మిషవశి విప్రుడనక యాచార్యద్రిశీ
ర్షుని దుమమడే? విడువుముదయ;
నిమ నమ్మిన ప్రజలు నవయ నీదయ యేలా?

— శ్రీకృష్ణదేవరాయలు

# తెరచాటు

## ( సాంఘిక నాటకం )

కవికోకిల, కవితావిశారద, ఉభయభాషాప్రవీణ

## గుర్రం జాషువా

రచనాకాలం : 1937

## భూమిక

దాదాపు ఎనిమిదేండ్లకు ముందు ప్రజామిత్ర సంపాదకులైన శ్రీయుతులు గూడవల్లి రామబ్రహ్మంగారు ఒక సాంఘిక నాటకాన్ని వ్రాసిన ఉత్తమ రచయితకు వేయి నూట పదహార్లు బహూకరింతుమని పత్రికలో ప్రకటించినారు. నాటి పోటీకి వ్రాసిన 43గురు రచయితలలో నేనొకడనై ఈ నాటకాన్ని వ్రాసినాను. వారేకారణం చేతనో గ్రంథములన్ని మూడు మాసాలుంచుకొని తగిన పరీక్షకులు చిక్కలేదను నెపంతో నెవరి గ్రంథాలు వారికి ముట్ట జెప్పినారు.

నామనస్సును వేధిస్తూ యున్న, పెక్కు విషయాలను సమకూర్చుకొని నేనీ నాటకాన్ని వ్రాసినాను. సంస్కరణాభిలాష నాకు మిక్కుటంగా కలదు. కథ కేవలం కల్పితం. బాల వితంతువుల హృదయావేదన, తత్ఫలితంగా కలుగు నానార్థాలు నేటి వైద్యుల నిష్కరుణ, సనాతనుల స్వార్థపరత్వం, ముసలి మగళ్ళు, పడుచు పెండ్లాలతో అనుభవించు కష్టాలు మున్నగు విషయాలను లోకానికి వెల్లడించడమే నా ముఖ్యోద్దేశం. నాటకంలో స్వగతాలుకాని, పద్యప్రాబల్యంకాని లేదు. మూడు గంటల కాలంలో నాటకం ముగిసి ఏ రవంత అభినయించేయశక్తిగల కళాప్రియులైనా ప్రదర్శించుకొనగల సౌలభ్యంకల విషాదాంత నాటకమిది. భాష వ్యవహారికం. కేవలం వచన నాటక మనవచ్చును. సహజ వసోత్పత్తికి నిహతి కలుగునని నాటకాలలో పద్యములకు తావీయ రాదను రసజ్ఞుల విమర్శకి నాటకాన్ని వదులుచున్నాను. నా అనుజ్ఞ లేకుండా దీనిని ప్రదర్శించరాదు. అట్లు ప్రదర్శించిన వారిపై తగిన చర్య తీసుకోబడును.

గ్రంథకర్త
జాషువా

# ఈనాటకమున వచ్చు పాత్రలు

| పురుషులు | | స్త్రీలు | |
|---|---|---|---|
| ప్రమోదుడు | : (సంఘ సంస్కర్త) | బుచ్చిరామమ్మ | : (బ్రహ్మశాస్త్రిగారి భార్య) |
| బ్రహ్మశాస్త్రి | : ప్రమోదుని తండ్రి, సనాతన బ్రాహ్మణుడు) | రాజ్యలక్ష్మి | : (కామశాస్త్రి భార్య) |
| కామశాస్త్రి | : ఒకానొక సనాతనుడు | శ్యామల | : బ్రహ్మశాస్త్రి కోడలు — ప్రమోదుని భార్య |
| కిశోర కుమారుడు | : ఒక ఆధునిక కవి | కల్యాణి | : బ్రహ్మశాస్త్రిగారి కూతురు, బాలవితంతువు |
| డాక్టర్ | : గిరి (ఒక షోకిలా) | | |

## తెరచాటు

(ప్రథమాంకము)

(ఒకటవ రంగం)

(బ్రహ్మ శాస్త్రగారి ఇల్లు - ప్రమోదు డీజీ చేర్లో కూర్చుండి, భారతి చదువు చుండును)

ప్రమో : (భారతి తిరుగు వేయుచు - వికసించిన ముఖంతో)
ఏమేవ్! ఒక మారిలా రా!

(శ్యామల ప్రవేశించి)

శ్యామల : ఏమిటండీ! (పుస్తకము వంకచూచి) ఏమిటా పుస్తకం (భారతి అని చదివి) ఈ నెల భారతేనా?

ప్రమో : ఈ వెల్దే ! (బొమ్మ చూపుచూ) ఈ బొమ్మను చూడు! ఎంతర్థ ముందో!

శ్యామ : (చూచి) (మూతి విరిచి) ఏమిటీ బొమ్మ అబ్బే! అంగ మొలతో! ఛీ ! ఛీ ! ఆ కళ్ళేమిటి ! ఆ చేతులన్ని వంకర ! ఏమిటండీ ! భారతి యివ్వాడు బాగుండన్లే దంటారు?

ప్రమో : అయితే ఈ బొమ్మలో యున్న అందం నీకు బోధ పడలేదన్న మాట.

శ్యామ : (అనిష్టమున్న) మీకు బోధపడ్డదేదో చెప్పరాదూ?

ప్రమో : పిచ్చిదానా! ఇది రోమన్ శిల్పం; శిల్పానికి ప్రాణం తెచ్చినవారు కదుటీ రోమన్లు! అసలు ఏ కళైన కొంత పరిచయము కలవారికొక్కక అందరికి బాగా ఉండదు. కళను గుర్తించేడం కూడా ఒక కళ.

శ్యామ : మీరు మరి నన్ను అంత మూర్ఖురాల్ని చేయకండి! ఇందులో యున్న కళేమిటేం, ప్రేతకళ, కూరలో ఉప్పు లేదంటే దాని రుచి మీకు తెలియదంటారూ?

ప్రమో : అట్లా అనడంకాదు. ఇవ్వాడు భాగవ

తం చదువుతూ ఉంటే కలిగే ఆనందం భారతం కలుగుతూ ఉంటే కలగదు. అంతమాత్రంచేత భారతంలో భాగవతం సాక్షాత్తుందా? కవిత్వానికి భారత కవిత్వమే ప్రమాణం.

శ్యామ : ఏమో! ఆ మెలుకువలన్నీ నాకు తెలియవు. చెవికి కంటికి యింపుగా యుంటేనే మాకు నచ్చుతుంది.

ప్రమో : అంతలో యున్నది మీ ఆడవాళ్ళ తెలివి. యోగుడు పువ్వు ఎత్తుగా, అందంగా ఉన్నంత మాత్రం చేత సంపంగికి సాటి చేస్తావూ? దాన్లో గుణాన్ని బట్టి.

శ్యామ : పోనీలెండి, మీ మగవాళ్ళదే తెలివి. ఆడవాళ్ళదేమున్నది? యీ అయోమయపర్థాలు. చెప్పికాదూ! మనవారు మోసం చేస్తున్నది లోకాన్ని. మీరు కూడా సంఘ సంస్కర్తల మంటూ తిక్ళరిస్తారే. మీకు కూడా! మా మీద విరసవ భావ మున్నదీ?

ప్రమో : సంఘ సంస్కరణకు దీనికేం సంబంధం, ఇవి లలిత కళలు, కళా ప్రసంగం వచ్చిందని. కాబట్టి అంటున్నాం. ఆడవాళ్ళకి తెలివి లేదని కాదూ. ఆడవాళ్ళవ్వాదివ్వదేం తెంత చదువుల్చదివి ఎంతెంత పమల్చేస్తున్నారో నాకు తెలియదూ! గృహలక్ష్మి పత్రికాదవాళ్ళరాతనేగా జీవం పోస్తున్నది.

శ్యామ : మరిలెండి, మీరొక్కరుపీకులాడ్తే అవుతుందటండీ! సంఘ సంస్కరణ మంటే, యెంత బలం ఎంత ధనముండాలి. ఈ కాకులు మిమల్ని గెలవనిస్తారూ! ఏమిటో మీగోల మీది. వినేవారేరి. ఆ యత్నం పమలవుతూనే యున్నై. మీ చెల్లెలు బ్రతుకు చూడారుగా! పుట్టి పుట్టక ముందే ముసుగేసి కూచో బెట్టారు. మీ నాయినగారికి ఈ విషయాల్లో మహా విశ్వాసం. నోరు మెదపటానికి వల్లకాదు.

ప్రమో : మా కళ్యాణి పెండ్లే నాకి పాఠం నేర్పింది. అప్పుడు! నా కెంత మాత్రం ధైర్యం లేకపోయింది. (కోపము తెచ్చుకొని) అప్పుడైతేనా! దొక్కబద్దలేసేవాణ్ని! (అని పుస్తకం అవతలకి పిసెరును).

శ్యామ : (నవ్వుచూ) ఎవరిమీద ఈ కోపమంతా? భారతి మీదనా?

ప్రమో : ఎవరి మీదనా! చూస్తుంటావుగా! రోజూ మా నాయన గారిని! నన్నూ! ఆయన యెద్దేమంటే నేను తెడ్డెం.

శ్యామ : (విచారంతో) మీ నాన్నగారు మీరు వాదించుకోవటం. ఆయన కోపమంతా నామీద చూపడం మధ్య నా కొచ్చింది చావు.

ప్రమో : ఓసేవ్! నీకిదే చెప్పడం విను. నీయేమీ భయపడ నవసరం లేదు. ఆయన మట్టుకు కాని. నేను యుండ దలచుకోలేదు. కాకపోతే వేరే కాపురం పెట్టు కుందాం. ఆ భాగం నా కిమ్మంటే రోగం కుదురుతుంది.

శ్యామ : అప్పుడు నలుగురూ అంటారుగా! పెండ్లాం రాగానే చీలదీసిందనీ! అదీ నాకే.

ప్రమో : మనకూ! ఏమేవ్, నలుగురితో పని లేదు. పదుగురితో పన్లేదూ. అభిప్రాయ భేదాలొచ్చాక ఆ ఇంట్లో యుండరాదు. లోకానికేం. అనేక విధాల మాట్లాడుతుంది. నా ఉద్యమంలో నన్న నడంలే?

శ్యామ : మీకే మండీ! మగవారు చెల్లించుకుంటారు.

ప్రమో : నాకు ఏమీ లేదూ. నీకు ఏమీ లేదూ. ఈయన వాలకం నాకేం బాగాలేదు. సత్రాలకని, సంతర్పణలకనీ యివ్వటికే బోలెడు సొమ్ము గుండనో బోసాడు. ఇంకా యుంటె ఉన్నకాస్త పోతుంది. లేనిరోజు పెట్టివాడెవడు? చేతిలో బెల్లమున్నంత మట్టుకే.

శ్యామ : అసలు మీకు ఈ యూరు తగదండీ! ఇది అనాచారపు కొంప. చదువుకొన్న వాళ్ళు ఏమన్ననా! వట్టి మాయముండా కొడుకులు. మీరు మీ ఉన్నతాశయాలన్నీ, వీళ్ళతో చెప్పబోతే, వీళ్ళకు వళ్ళు మండుతుంది. పైగా శపిస్తారూ! ఏమద్రాసులోనో, ఏ బొంబాయిలోనో యుంటేగాని మీ బోటి వాళ్ళ ప్రయత్నాల్నెగ్గవు.

ప్రమో : ఈ యూరి వాళ్ళకు చదువెందుకు; పొట్టబోసుకోవడమే చదువు. చూస్తున్నావుగా. ఒక్క స్కూలుంటేనే పుట్టి నాటి నుండి ఎట్లున్నదో ఇప్పుడూ అట్లానే ఉన్నది. గొఱ్ఱె తోకకు మతే. పాపమా కిశోర కుమారుణ్ణి చూడు. అతడొక్కడూ ఊరికల్లా కవి. వాడి మొహం చూచే వాడెవరూ? బ్రతికిన వాళ్ళం చూచి మనవాళ్ళు సంతోషించరుగా! వట్టి కుళ్ళు.

శ్యామ : మరచా! ఆ అబ్బాయి, పద్యాలు భారతీలో పడుతూ యుంటాయిటగా!

ప్రమో : ఒహ భారతీలో యేమిటి! అన్ని పేపర్లల్లోను పడుతూ ఉంటాయి. నిజం మాట్లాడితే కవి అంటే అతన్నే చెప్పాలి.

శ్యామ : అట్లాగుటండీ! పిచ్చిబాగుల వాడల్లే యుంటాడు. ఆ తల్లి చేసుకున్న పుణ్యం.

ప్రమో : అతనంటే ఆ బ్రాహ్మణులకు మంట

శ్యామ : అయ్యో! యెందుకు

ప్రమో : ఎందుకూ? మన కులం కాదుగా.

శ్యామ : రామ! రామ! కులానికి, తెలివి తేటలకి ఏమి లంకె?

ప్రమో : సరే కులానికొక తెలివి, కులానికొక రంగు, కులానికొక రూపం గాదూ; మనవారు నిర్ణయిస్తా. ఇప్పుడే పార్టీలు, దెబ్బలాటలు, ద్వేషాలు, యుద్ధాలు వచ్చేదంతా ఈ వర్ణద్వేషం నుంచేగా, ఇప్పుడిటలీకి, అబ్సీనియాకు యుద్ధం.

శ్యామ : (వింతగా చూస్తూ) మళ్ళీ! యుద్ధమొచ్చింది? దేనికా తగాదా?

ప్రేమో : ఇంకే ముంటుంది. నల్ల, తెల్ల రంగు భేదమే! ఇంతటితో యుద్ధ మాగ దంటున్నారు. దీన్తో ప్రపంచ యుద్ధ మొస్తుందంట.

శ్యామ : రానివ్వండి! అట్లన్నా నాశనమే పోతుంది. పాడు భూమి. లెండి భోజనానికి వేళైంది.

(ఇద్దరూ నిష్క్రమింతురు)

(రెండవ రంగము)

(అయిదేండ్ల వయసుగల కళ్యాదికి తల దువ్వుచూ బుచ్చి రామమ్మ వసారాలో కూర్చుండి యుండును)

బుచ్చి : (కూతురు వెంట్రుకలు ముద్దు పెట్టు కొని హీన స్వరముతో) నీలాల వంటి మా అమ్మ వెంట్రుకలు మంగలి వాని కత్తికి అర్పించాలి కాబోలు. ఒక్కగాని ఒక్క ఆడనలుసు, నా చేతులారా మా అమ్మకే అగుడాట్లు తెచ్చా పాపిష్టి దాన్ని. బ్రతికినన్నాళ్ళు దీని కడుపున కత్తులు దాచాను. కళ్యాదీ, కన్నీళ్ళయి ఇంట తిరుగుతుంటే ఎట్లా భరించాలో ఈ దుఃఖం.

కల్యా : (తిరిగి తల్లివంక చూచి) అమ్మా! నా వెంట్రుకలు తీయిస్తారుటే?

బుచ్చి : ఇప్పుడు కాదమ్మ, ఇప్పుడుకాదు.

కల్యా : (గోము నభినయించుచు) ఆ పాపం ఏం బాగుంటుందమ్మా! బోడితల? పాడు? (మురిపముతో) మరే! అమ్మా మరే! అన్నయ్యలాగా క్రాపు చేస్తే బాగుంటుందే. చొక్కా వేసుకొని, బూడ్సులు పంట్లాం వేసుకోవాలని ఉందే.

బుచ్చి : (మెటికలు విఱచి ముద్దు పెట్టుకొని) ఎంత పిచ్చితల్లివే! ఎంతమాయకు రాలివే! అమ్మా (అని విచారపడకు).

కల్యా : అమ్మా! నాయనమ్మ! వారానికొక మాటు బోడిగుండు చేయించు కొంటుందే! ఎందుకే, ఛీ! పాడూ! నున్నగా నూ! అందానికటే!

బుచ్చి : అందానికి కాదు తల్లీ! మొగుడు చచ్చినవాళ్ళకి వెంట్రుకలుంచరు. మన కులాల్లో.

కల్యా : నాయనమ్మ మొగుడు చచ్చాడటే? ఎప్పుడూ? కాబట్టి నేనెదిగినాక ఎన్న డూ మనింటికి రాలా!

బుచ్చి : (నవ్వు) ఛీ! కొండెముండా! ఎఖ్ఖడో! నాకెందుకే పెద్దవాళ్ళ పోకిళ్ళు, పాప సాని మాటలూ! ఎదిగినాకట ఎన్నా ళ్ళ నుంచెరుగో.

కల్యా : (గోము నభినయించుచు) అమ్మా! నాకు బొట్టూ, కాటుక బెట్టుకొని మన దొడ్లో పూలన్నీ పెట్టుకోవాలని యుందే ఏమేఅమ్మా! పెట్టవూ? పండగనాడూ!

బుజ్జి : (చింతతో బుజ్జగిస్తూ) తల్లీ! నీ అచ్చట ముచ్చట అగ్గిపాలై శాన్నాళ్లైందే. నా బంగారు తల్లీ! అట్లా అనకు.

కల్యా : ఆ! ఆ! మీరంతా పెట్టుకుంటున్నారుగా అమ్మా!

బుచ్చి : ఆ భగవంతుడు నీకర్మ మీలాకాల్చి మా కన్నుల్లో నిప్పు ల్పోలిగాడు తల్లీ! నువ్వు పెట్టుకో కూడదే!

కల్యా : ఆ,ఆ, ఎందుకేమిటి?

బుచ్చి : మువ్వ ముండమోశావు తల్లీ! ముండ రాత రాశాడే భగవంతుడ్డీకూ.

కల్యా : పోద్దూ! ముండమోశానా? ఎవ్వడమ్మా నేనే మ్మోయులా! మొన్న నా చిన్న బిందెతో నీళ్ళు మోశా.

బుచ్చి : కాదే! అమ్మ కాదు. ముండమోశావంటే నీ మొగుడు చచ్చాడన్న మాట.

కల్యా : (జ్ఞాపకము తెచ్చుకొని ఆ, ఆవేళ ఆవేళ మామయ్య చచ్చి పోయాడనీ మీరంత యేడ్చారే. ఆయనా ?

బుచ్చి : ఆ,ఆ, మామయ్యే మా కొంప ముంచి పోయింది.

కల్యా : అమ్మా! మామయ్యోల్చస్తే ముండ మోస్తారుటే? వదినెకు అన్నయ్య మామౌతాట్టే?

బుచ్చి : కాదమ్మా! మేనరికమని నిన్నిచ్చి చేస్తే, మేనరిక మేట్లో కలిసింది.

కల్యా : అమ్మో! మరే!మరే! మామయ్యే. బహ నూరొచ్చి నన్నెత్తుక తిప్పాడే. ఇంక నన్నెత్తుక తిప్పే మామయ్యల్లేరు?

బుచ్చి : (తనలో) అయ్యో! ఈ వెడ్డి తల్లి నెట్లా ఓదార్తునో తెలియదు.

(శ్యామల ప్రవేశించి)

శ్యామ : అత్తయ్యా! నీ కొడుకు నొక్కమారు కెకేయి! కాఫీ కూడ పుచ్చుకోకుండా ప్రొద్దున్న వెళ్ళాడు. ఇంట్లో కూర లేమీ లేవు.

బుచ్చి : (విసుక్కుంటూ) ఏం కూరల్లే, ఏదో ఒ పాటి తగలెయ్యి (కల్యాణితో)అమ్మా! అన్నయ్యను పిలుచుకొస్తావూ?

కల్యా : ఉ.హు. నేను వెళ్ళనూ.

బుచ్చి : (గెడ్డము పట్టుకొని) వెళ్ళమ్మా!వెళ్ళు

శ్యామ : కల్యాణీ! వెళ్ళవూ? మీ అన్నయ్య వచ్చాక మన గ్రామ ఫోను పెట్టు కొందాళ్లే.

కల్యా : (సంతోషపడుచు) నాతోడూ? ఒట్టేయి.

శ్యామ : నీ తోడు, ఒట్టు.

కల్యా : పరిగెత్తును.

బుచ్చి : (నవ్వుతూ) అమ్మయో! ఇదీ మహ పెంకి ముండ సుమా. నాతో యేమేం ప్రసంగిస్తుందో విన్నావూ? అన్నీ మూదూసులు.

శ్యామ : వింటూనేయున్న! ఏమయితే, యేం సుఖం. ఈ తనువెలా తెల్లార్చుకుంటుందో?

(నిష్క్రమింతురు)

(ప శే షం)

# కొత్తలోకానికి పునాదులు వేసిన జాషువా కవి

## కవి అయినవాడు మనిషికి జరుగుతున్న అన్యాయాన్ని సహించలేడు.

ఒక మనిషనే కాదు పశుపక్ష్యాదులకు కూడా అన్యాయం జరగకూడదని ఆరాటం. ఆదికవి వాల్మీకి కిరాతుణ్ణి "మానిషాద ప్రతిష్ఠాత్వం" అని తొలిశ్లోకంతో అతికఠోరంగా శపిస్తాడు. Poet is Responsible for Mankind Even for Animals. అంతటి బాధ్యతను తీసుకుంటేనే అతడు కవి అవుతాడు అతడి రచన కావ్యమై అజరామరం అవుతుంది. దీనికంతటికి మూలం కవిలో అంతర్మథనం ప్రారంభం కావాలి. అంతర్మథనం లోంచి అమృతం ఉద్భవిస్తుంది. "సృజింపగోరెద జగంబున్ నేటి దౌష్ట్యంబు సోకని బంగారపు మంటితో సమరసైక్య స్వాదుభావాలతో...."అని చేసిన ప్రార్థన అంతర్మథనోద్భవమైన అమృతమే. అసలు ఈ ప్రార్థన ఎందుకు చెయ్యాల్సివచ్చింది? నేటి లోకం పోకడ ఆ విధంగా ఉంది మరి. మరో ప్రపంచం పిలిచింది పదండి ముందుకు తోసుకు...." అంటూ హెచ్చరిక ఎందుకు చెయ్యాల్సి వచ్చింది. జాతులు, మతాలు గల్పించు సమరములకు/ పుట్టకొలదీ రక్తంబు పోసినాము" దాని వల్ల కష్టాన్ని నష్టాన్ని క్రాస్‌రోడ్స్‌లో నిలబడిచూడు అని బ్రహ్మదేవుణ్ణి నిగ్గదీసి అడిగిన పరిస్థితి అది, "అణుశస్త్ర ప్రళయంబు దెచ్చుకొని దుర్మార్గపోవ సంసిద్ధమై/ రణభేరిన్" మొరయించు క్రూర మదగర్వ గ్రస్తమైన అతి అపాయకరమైన తరుణం అది. ఇక్కడ "శోకం" ప్రారంభం అవుతుంది. ఈ శోకం కవి అయినవాడిలో "శ్లోకత్వం పొందుతుంది. అందుకే శోకం శ్లోకత్వ మాగతః" అయింది.

ఇది నిజానికి రసం ఉత్పన్నమయ్యే ఒక అన్వేషణ స్థితి. అందువల్ల కవి గుండె మెత్తబడడమో, లేక మందడమో జరుగుతుంది. ఒక్కోసారి రెండు ఏకకాలంలో జరగటం కద్దు. అప్పుడు ఉత్పన్నమయ్యే వాక్యమైనా, చివరకు శబ్దమైనా కావ్యత్వాన్ని పొందుతుంది. రసాత్మకం వాక్యం కావ్యం అన్నా రమణీయార్థ ప్రతిపాదిక శబ్దం కావ్యం అన్నా అందుకే దీనంతటికి మౌలికమైన కారణం జగద్ధితం. "వృద్ధవ్యక్తి వీపాటి మాయా నాట్య ప్రళయ ప్రపంచ గమనంబర్థబు గాదైనన్...." మవ్వప్తే "నేను వర్ణించెదన్" అని ముది మది తప్పిన మొదటి నేల్పును ముక్కు పట్టుకు లాక్కొస్తాడు.

నాల్గురోడ్ల కూడలికి. అసలా బ్రహ్మ ఎందుకు రావాలి. "తమాషా భక్తితాత్పర్యములన్ వెయ్యిన్నూరు / మతాలు వర్ణములు మొల్చెన్ చోల్పె వైషమ్యములన్ / భాయీ! వాయిగదల్చి ఈ బెడద మాన్పన్ దిగ్గిరమ్ముర్వికిన్" అందుకురావాలి. ఇప్పుడీలోకానికొచ్చిన బెడద ఏమిటి? "దొంగలంజకొడుకలనవే మెసిలేధూర్తలోకం" ఇది కాబట్టి "కొత్తలోకం" కావాలి. ఆ కొత్తలోకం లో విశ్వమందుగల్గు ప్రేమ సర్వస్వంబు/ ముద్దజేసి హృదయములను మలచి / మెరయు సత్యమెల్ల కరిగి రేకులు గొట్టి / సృష్టి చేయుమయ్య జిహ్వకలను" ఆ జిహ్వలు నిజాన్ని పలకాలి. అంతేకాదు "దుష్టభర్తల కృపాహీన ప్రవృత్తుల్ అంపపు కోతగోయు.... సుందరుల" లూరడించాల్సిన అవసరం ఏర్పడింది. ఇప్పుడు "లేవేనాటి స్వాతంత్ర్యముల్ స్త్రీ / కీమారు సమాన గౌరవ విభూతిన్ గాంతకుంగూర్ప" వలసినస్థితి. ఇదంతా కొత్తలోకంలో కావాల్సినవి. అందుకోసం ఆ బ్రహ్మని "కంచుకోటద/ర్వాజులు దాటి రమ్ము బహిరంగముగా రతనాల తేరుపై...." అహ్వానిస్తాడు కవి, ఇది ఒక విధంగా "విధి" మీద తిరుగుబాటు. బాధలు పడ్డవాడే భాయీ అని చేర బిలుస్తాడు. కరుణతో మరొకట్టి. ఇక్కడ భగవంతుణ్ణే భాయీ అని పిలుస్తాడు. అంతేకాదు "స్రష్టకింతరాజసంబు తగదు" అని మందలించి "అమృతముం జిల్కి చింతలనపనయించు / హృదయముగలట్టి నవరచయితను నేను" అని అంటూ తనదైన గొప్పతనాన్ని కూడా విదితం చేస్తాడు. "మాది కలికి తెలుగు కులము" అని "సుకవి జీవించే ప్రజల నాలుకలయందు" అయినవాడు కవి కోకిల జాషువా.

జాషువా సృష్టికర్తను.... "ఇద్దరి మధ్య మనకు / ముసుగులో గ్రుద్దులాటలు పొసగవింక / హక్కుగలదయ్య ప్రశ్న సేయంగ నిమ్ము!" అంటూ తన హక్కును సార్థకం చేసుకున్న కవితావిశారదుడు. ఆయన (దేవుడు) వచ్చి "అల్లావో! మరియాతనూజుడవో! యజ్ఞాక్షుండవో! శాంబరీ ఖిల్లస్వామివో! బుద్ధదైవతమవో! వేదాంతశాస్త్రశిలో వల్లింపబడుశబ్దరూపుండవో! విస్పష్టంబు గావించి" పోవాలి. ఆ పని తానే చేయగలడు. ఎందుకంటే "నీవుగల్గియున్న దైవశక్తులందు / మూడు పాళ్ళు మాకుగూడ కలవు" "పూనినరుడు చేయలేనిదేమి?" అన్న ధీమా గలదు జాషువాకు.

సమాజంలో నిజమైన ప్రజానాయకుడు కవే. అందుకే కవి Unacknowledged Legislature. కవి బాధలోంచి ప్రభవించిన ఆక్రోధమే కార్యాచరణకు అంకురార్పణ. ఈ అంకురార్పణ ప్రారంభం నుంచే ధర్మాధర్మ నిర్ణయం జరగాలన్న చైతన్యం మానవ సమాజంలో ఉద్భవిస్తుంది. ఈ చైతన్యమే కావ్యరూపం ధరిస్తుంది. ఆ కావ్యమే కార్యాన్ని నిర్దేశిస్తుంది. కాబట్టి కవికృతమైన కావ్యం నుండి సమాజానికి కార్యనిర్దేశం కావాలి దానగుణహీనమైన విజ్ఞానమేల?" అని ప్రశ్నించి- ఆ కోపంలోంచే తనకు కావాల్సిని కార్యాన్ని సూచిస్తాడు జాషువా. "శాంతినింపారు జగత్తుమాకిపుడవశ్యము సృష్టి యొనర్పుమీశ్వరా!" అశాంతి మయమైన జగత్తుకు ఇప్పుడు కావా

ల్సింది 'శాంతి'. ఈ 'శాంతి' కోసమే నేటి ప్రజలు తహతహలాడిపోతున్నారు. "అధికారంబను నల్లమందుతిని దేహం చెల్లనున్మత్తమై/బధిరత్వము దృష్టిమాంద్యము వరింపం చాలితశ్రేణికిన్!...." వీళ్ళని తాను ఆశ్రయించిన "నవ్యక్షోణిలో నీ మహా/రథమున్ లాగెడు వాహనంబులుగ నిర్మాణంలో గావింపుమా...." అని నేటి అవినీతి అధికారుల్ని శపిస్తాడు. నరుని మోసం తెలిసి కూడా నవ్వు మొగాలతో పాలొసంగు" గోవుల సహన స్వభావమును పొందనరి. షము మా మనసులన్...." అని శాసిస్తాడు.

అసలు కవి కర్తవ్యం ఏమిటి? "కలము పట్టినట్టి కవులెల్ల నీలోని/ సుగుణపుంజెల్ల పొగడుచుండు/ టీనా మరి "ప్రజల కష్టములను బలుకువారెవ్వరు?" అని కవి కర్తవ్యాన్ని నిర్దేశిస్తాడు జాషువ. కవే అసలు ప్రజా నాయకుడు. ఇక్కడ ఎమర్సన్ వాక్యాలు స్మరణీయాలు

The Breadtn of the problem is great. The poet is the representative. He stands amor.g partial men for the complete man and appraises us not of his wealth, but of the common wealth" అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతి:" అందుకే "అశలెక్కసాగే భరతావని ఒంపు వసంతశాంతి సందేశము లస్త్ర శస్త్రముల నీచరణ ప్రళయయుంబులార్ప. ."అని ఆశ్వసిస్తాడు. ఇప్పుడు ప్రపంచం అంతటా జరుగు తున్నది అస్త్ర శస్త్ర జరణ ప్రళయమే కదా "Breadth of the problem is great"ను దాదాపు 42 సంవత్సరాల క్రితమే చూడగలిగిన ఋషితుల్యుడు జాషువ. అందుకే అందరిలాగా Problem ను మాత్రమే చెప్పి పూరుకోకుండగా, సమస్యా పరిష్కారాన్ని కూడా సూచించాడు. ఆచరించవలసిన విధానాన్ని నిర్దేశించాడు. "నావ్యష్టికురుతేకావ్యం."

ఇంకా జాషువ అసితేని సేనా నాయకుడైన "తోడ మొహన సబర్మతి నమ్మనికింగు మారుడు" ఈయన ధరించిన ఆయుధాలు "నా కవచంబహింస, సహనంబు మహాయుధ ధరించి "యనంత జగత్తుమొత్తమై నాకెదురైన గెల్తును" అని కొత్తలోకం సృష్టికి బైలుదేరిన జాషువ.

"ఆడిన మాట తప్పను, మహాత్ముని చెప్పుల జాడలోనకా/ లాడచరించెదన్, ప్రజల కన్నముబెట్టెద వర్ణభేదపుం/ జీడనూంచెడన్, గటిక చీకటివాపెద, వెత్తి నమ్మకా / లూడని బాడహస్తమున నూనెద శాతకళాకులారమున్...."

ఇది జాషువా ఆశించిన కొత్తలోకం. ఆయన "అధికార కథా ప్రణాళిక."

"హృది ప్రతీష్యా కవయో మనీషా" అని ఋగ్వేదం (10-129-4)"పదవీః కవీనాం" అని తైత్తరీయోపనిషత్, చెప్పినదిందుకే.

జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరా....

— భమిడిపాటి కృష్ణమూర్తి

# ఫ్రీడమ్ ఫైటర్

డా॥ యన్. గోపి

అతడు నాకు రోజూ కనిపిస్తాడు,
రెపరెపలాడని పాతబడ్డ పంచికలా
చకచలా నడవలేని కాంస్యవిగ్రహంలా ఉంటాడు.
రెట్టలతో ముగ్గుబుట్టయిన తలతో
కనిపించినప్పుడల్లా "మూడ్" పాడుచేస్తాడు.

నాలుగురోడ్ల కూడలిలో నలభై రెండోసారి.
గాంధీగారికి గద్దె కట్టడానికి సిద్ధమైన
చాదస్తపు శిల్పిలా ఉంటాడు.
వేళ్ళ కొసలమీద వందేమాతరం పునల్ని దొర్లిస్తూ,
కనపడ్డ ప్రతివాణ్ణీ అపరాధిని చేస్తాడు.

ఆదర్శం పేరా ఆశయం పేరా
జీవితాన్ని రోడ్లపాలు చేసుకున్న వెర్రివాడు.
సమస్తాన్ని తృణంగా ఊదేసి
గోచిగుడ్డ కోసం యాచిస్తున్నాడిప్పుడు.
లక్షల్లో త్యాగాన్ని వెలిగించి
ఇంట్లో ఎండిన డొక్కలకోసం ఇల్లిల్లూ తిరుగు తుంటాడు.

అర్ధరాత్రి మెట్లు దిగిపోయిన సిద్ధార్థుడు
కపిలవస్తులో రొట్టె దొంగిలిస్తూ పట్టుబడ్డాడు.
అతడితడే!

వేలాది మైళ్ళు నడచిన సర్వన్యాసి.
వాహనాలు చల్లిపోయే మురికిని ఉతుక్కుంటాడు.
రూపాయి సూర్యోదయం కోసం యోగనమస్కారాలు చేస్తాడు.
అమ్మటానికేమీ లేదు చరిత్ర తప్ప!

అతని సంతానం గతగాథల బరువుతో వొంగిపోయి నడుస్తారు
ఆధునిక విపణి వీథుల్లో అలనాటి సాహసాలు అమ్ముడుపోవు.
చరిత్ర - గోడ్లు అట్టల మధ్య అలమారల్లో నిద్రపోతుంది.
చరిత్ర-సావనీరు అడ్వర్‌టైజ్ మెంట్ల మధ్య
తలొంచుకొని బిక్క చూపులు చూస్తుంది.

వాళ్ళంతా ఒకే చెట్టు ఆకులు.
వాళ్ళంతా ఒకే స్వార్థం దూసిన బాకులు.
ముసలాడి ఉపన్యాసానికి చప్పట్లు మోగవు.
వేదనకు త్రిల్లును జోడించలేడు కదా!
కన్నీళ్ళలో ఇంద్రధనుస్సుల్ని పూయించలేడు
రంగంలో చెలామణీ అయ్యే సరుకును.
ఛలోక్తుల్తో అందించ లేడుకదా!
ఒట్టి ఔటాఫ్ డేట్ రాట్!

రోజూ రోడ్లను దగ్ధం చేస్తూ నడుస్తుంటాడు.
చిటపటల శబ్దాల్తో పెళ్ళలు రాలి పడుతుంటాయి.
జైలు ముఖం చూడని కుర్రమంత్రి
జైలు సర్టిపికెట్టు కోసం తిప్పుతాడు.
వీధిజనం జండా ఎగరేస్తుంటే
ఆఖరున నిలబడి కన్నీళ్ళు కారుస్తాడు.
అతడు నాకు రోజూ కనిపిస్తాడు
కనపడ్డ ప్రతివాణ్ణీ అపరాధిని చేస్తాడు
అతణ్ణి తప్పుకు పోవడానికి దారులు వెతుకుతున్నా నేను.

# బ్రతుకంటే చైతన్యం

- హేమలతా లవణం

"బ్రతుకంటే నిప్పులు కక్కడమూ కాదు
కన్నీళ్ళు కనుగుడ్లలో కుక్కడమూ కాదు
జుట్టు పీక్కోవడమూ కాదు
చుట్ట చుట్టుకొని పడుకోవడమూ కాదు ..."

జీవితమంటే అటువంటి నిశ్చైతన్యము కాదనే కమల నిరూపించింది. నలుగురు పిల్లలున్న ఇంట ఆమె పెద్ద పిల్లగా పుట్టింది. ఆమె డిగ్రీ చదువుల్లో వుండగానే కుటుంబాన్ని నడిసంద్రాన వదలి తండ్రి రంగము నుండి శాశ్వతంగా తప్పుకున్నాడు ఒకనాడు అకస్మాత్తుగా. ఆనాటి నుండీ కమల లేత భుజాలపై కుటుంబ బాధ్యత పడింది. చదువుకు స్వస్తి చెప్పి చిన్న సంపాదన గల ఉద్యోగంలో చేరింది. ఇద్దరు చెల్లెళ్ళు, పెద్ద తమ్ముని చదువుల సంరక్షణ అనురాగ పూర్వక బాధ్యతను, విధవ తల్లి పోషణను అత్యంత శాంత గంభీరతతో తన భుజాలపై ఆనందంగా ఎత్తుకున్నది.

పదేళ్ళు గడిచాయి. తమ్ముడు, చెల్లెళ్ళ చదువులు పైకి వస్తున్నాయి. తన సంపాదన ఎటూ చాలక సతమతమయ్యే సమయంలో కమలలో తనకు తెలియకనే సహచరునికై కాంక్ష చెలరేగింది. ఏది మంచి? ఏది చెడుపు అని ఆలోచించ లేకపోయింది. ఇంతటి బాధ్యతను మోస్తూ కూడ తన స్వవిషయం ఎదురు రాగానే దాని ప్రభావం ఆమెను బలహీనురాలిగా చేసింది.

తన తోటి ఉద్యోగి ఆమె పరిచయం కోరి తపించి, తపించి ఒకనాడు ఆమెకు తన మనోభావాన్ని వెల్లడి చేసిన నాటినుంచీ కమలలో మథనం ప్రారంభమైంది. ఆమెకు నిద్ర దూరమైంది. ఆకలి మందగించింది. ఎటువేపూ తన నిర్ణయం తేల్చుకోలేక వ్యథకులోనైంది. గమనించిన తల్లి అడిగిన దానికి ఆమె తన వ్యథను తెలుపుకున్నది. వద్దు.... కాదు అనలేని తల్లి 'నీ ఇష్టం' అన్నది. ఆ ఒక్కమాటతో ఆమె తన హృదయస్పందనకే ఓటు వేసుకుని తన సహ ఉద్యోగికి మాట ఇచ్చింది వివాహానికి.

వివాహానంతరం తను తీసుకున్న నిర్ణయంలో లోపం జరిగిందని త్వరలోనే అర్థమైంది. తన సంపాదనపై భర్త ఆంక్షలు విధించడమే కాదు, తన ప్రవర్తనపై అభిశంసనం ఆరంభించాడు. తన కుటుంబ బాధ్యత నుండి తప్పుకోమన్నాడు. తనకంటూ హక్కు లేదన్నాడు. అతని ఆజ్ఞలు జారీచేస్తూ దినమొక నరక ప్రయత్నంగా మార్చివేశాడు. అన్నింటినీ సహించినా. వివాహితులు కాని చెల్లెళ్ళు; ఉద్యోగంరాని తమ్ముడు; తనపై ఆధారిత తల్లీ....వీరి బాధ్యతను తాను విస్మరించలేకపోయింది. ఆత్మహత్య ఏ మాత్రమూ పరిష్కారం కాదని తెలుసుకున్నది. కమల భర్తకు జవాబు చెప్పింది. తన బాధ్యతలే తమ ఇద్దరి బంధం కన్నా

పెద్దవి, మానవతతో కూడినవని. ఈ జవాబు వారిద్దరినీ శాశ్వతంగా విడదీసింది.

కమల స్థితప్రజ్ఞురాలైంది. జీవితపు మార్గాన ఎదురైన గతుకుల గుంటలలో పడక వాటిని ఎగిరి ఆవలకు దూకింది. తన జీవితాన్ని ఉద్దీప్త చైతన్యమార్గాన నడిపించుకుంటూ నడిచింది. చెల్లెళ్ళ వివాహాలు జరిపించింది. తమ్మునకు ఉద్యోగం వచ్చింది.

ఒకనాడు తమ్ముడు అన్నాడు ఆమెతో: "అక్కా! మరొక్క సంవత్సరమే నీకు శ్రమ. నీ యీ భారాన్ని నా భుజాలపై చేర్చుకుంటాను" అని. అలాగే జరిగింది.

ఒకనాడు ఆమె అద్దంలో చూసుకుంటూ పావటి మార్గంలోని పులితకేశాన్ని చూచి తృప్తిగా నవ్వుకొన్నది.

---

"బ్రతుకంటే ఉద్దీప్త చైతన్యం
జలవిద్యుత్తుతో దాని బాంధవ్యం
బ్రతుకంటే వర్షామేఘం
బీళ్ళతో ఏళ్ళతో దాని అనుబంధం"—

—సి. నా. రె.

---

# అంతరాలు

—గొల్లపూడి మారుతీరావు

అతడు నిజాయితీకి నివురు కప్పిన నిప్పు.
ఊసుపోని బాటసారుల కాలికింద చెప్పు.
అతడు ప్రత్యర్థుల గుండెల్లో దూసుకొనే బులెట్
అందుకే–జాతి సమ్యక్ రథానికి ఎన్నికయిన పైలెట్.

అతడు నీతిని భోంచేస్తాడు.
శాంతిని వాంఛిస్తాడు.
సత్యాన్ని అనుసరిస్తాడు.
ఆదర్శాల్ని ఆహ్వానిస్తాడు.

అందుకే అమధ్య మాపూళ్ళో కిళ్ళీకొట్టు ప్రారంభించి
అప్పుల్లోపడి ప్రస్తుతం అడుక్కుతింటున్నాడు.

ఈతడు ఖరీదైన స్కాచ్‌ని సేవిస్తాడు.
సుఖానికి అనునిత్యం చీకటిని ఆశ్రయిస్తాడు.
మిత్రులో మీదవతీ లాస్యాన్ని ఆస్వాదిస్తాడు.
అప్పుడప్పుడు అవసరానికి ప్రాణాల్ని తీస్తాడు.

ప్రస్తుతం చిన్నతరహా నాయికుడుగా ఉంటున్నాడు
రేపటి పెద్ద పదవికి వోట్లని నమ్ముకుంటున్నాడు.

అతడు గాంధీని అలవాటుగా పూజిస్తాడు
దేవుడిని నియమం తప్పక ధ్యానిస్తాడు
పేదరికం బుజం మీద చెయ్యి వెయ్యడం వ్యసనం.
అవసరం, ఆర్తనాదాలు మధ్య అతని సింహాసనం.

ఈతడు గాంధీ విగ్రహాల్ని ఆవిష్కరిస్తాడు
దేవుడికి కెమెరా కనిపించేలా నమస్కరిస్తాడు
పేదరికాన్ని పేపర్లో తెలిసేలాగ గుండెలకి హత్తుకుంటాడు.
ఆర్తనాదాన్ని మైకుల ముందు ఎత్తుకుంటాడు.

అతడు మొన్ననే కనుమూశాడు
అతని వంటి మనిషుండడు
ఈజాతి అదృష్టమని
ఈతడు అతని సమాధి మీద సున్నం వేశాడు.

సాహిత్య వార్తాలహరి :

# "తెలుగు నవల - సామాజిక దృక్పథం" సెమినార్




డా॥ రమాపతిరావు, డా॥ మృణాలిని, ఆచార్య పి. ఆనందారామం
పద్మభూషణ్ డా॥ నారాయణరెడ్డి, హేమలతా లవణం.

అగస్టు 24న హైదరాబాద్ నగరంలో జాషువా ఫౌండేషన్ సెమినార్ నిర్వహించింది.

సభకు స్వాగతం పలుకుతూ శ్రీ అక్కినేని బలరాం (కన్వీనర్) "జాషువా ఫౌండేషన్ ప్రతీ రెండు నెలలకు ఒక సాహిత్యసభ నిర్వహించాలని నిర్ణయించినప్పటినుండీ యీ సెమినార్ రెండవది. ఇలాగే ఆంధ్రదేశంలోని ముఖ్య పట్టణాలలో సాహిత్యసభలు, కవితాగోష్ఠులు నిర్వహించబోతున్నది. నవల, కథలలో సామాజిక జీవన విధానాన్ని ప్రతిబింబింపజేస్తూ, సామాజిక దృక్పథాన్ని స్పష్టంగా చూపించగలిగితే, అది చైతన్యవంతమైన రచన. తెలుగుకవులు,

రచయితలు కొందరు యీ సామాజిక స్పృహతో వ్రాసిన రచనలు ఉద్యమస్ఫూర్తిని కలుగజేసినవి." అన్నారు.

అధ్యక్షత వహించిన డా॥ సి. నారాయణరెడ్డి గారు పలుకుతూ, "సామాజిక దృక్పథంతో జీవిత సమస్యల్ని ప్రతిబింబించే నవలలే మంచి నవల, అటువంటి నవలల ఆవశ్యకత ఎంతైనా వున్నది.

ఆధునిక సాహిత్యంలో నాటకం, నవలకు 19వ శతాబ్దంలోనే బీజాలు పడ్డాయి. గురజాడ 'కన్యాశుల్కం' సాహిత్యంలో కొత్త దృష్టిని ప్రసాదించింది. కందుకూరి తొలి నవలాకారుడు. 'సత్యవతీచరిత్ర' ఆయన వ్రాసిన తొలి నవల.

సామాజిక దృక్పథంతో, గ్రామీణ వాతావరణాన్ని చిత్రిస్తూ, సామ్యవాద దృక్పథాన్ని ప్రతిబింబించిన తొలి నవల ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి'. హిందీ రచయిత ప్రేమ్‌చంద్ రచనలకు దీటైన నవల 'మాలపల్లి'.

కొందరు సమాజాన్ని మించి ఆలోచింపజేసే భావధారను పట్టుకుంటారు. సామాజికమైన దానికి ఎదురీది కొత్తఆలోచనలు ప్రతిష్ఠించేరవి, రచయిత చరిత్ర సృష్టిస్తారు. కొందరు కొత్త భావధారకు భయపడి వెనక్కుపోతారు. మరి కొందరు ఒడ్డుమీద కూర్చొని 'మనకెందుకులే' రకం. ఈ చివరి ఇద్దరూ సమాజానికి నూతనత్వం అందించలేని పిరికివారు.

కందుకూరితో అంటే సంఘ సంస్కర్తతో నవల పుట్టింది. ఒక గొప్ప సాంఘిక చైతన్యానికి శ్రీకారం చుట్టి సమిక్త భారత సాహిత్యాన్ని పునర్జీవింపజేసింది.

సామాజిక దృక్పథంలో నవలలు రావాలి. గొప్ప మనస్తత్వ చిత్రణ భూమిక కావాలి.

ఆ మధ్యకాలంలో బుచ్చిబాబు, గోపీచంద్, రావిశాస్త్రి, కొడవగంటి, చలం, ఇటీవల రంగనాయకమ్మ, సీతాదేవి, లత, స్త్రీవాదంతో ఓల్గా సామాజిక దృక్పథాన్ని చిత్రీకరిస్తున్నారు. ఇది ఆశాజనకం.

ఒక విషయం గమనించాల్సివుంది మనం. నేడు తెలుగు నవలలు సినిమా వరవడిలో పడి కొట్టుకు పోతున్నాయి. అసలు 1960 నుండి నవలలను పత్రికలే పోషించాయి. ధారావాహికంగా నవలలు ప్రచురిస్తూ రచయితలను ప్రోత్సహించాయి. అయితే తాము వ్రాస్తున్న నవల సినిమా నిర్మాతల దృష్టికిపోతే బాగుండననే దృష్టి సినిమా ఫక్కీలలో వ్రాస్తున్నారు. అసలు "సినిమా చూస్తున్నానా! అనే భావన నవల చదివితేనే వస్తున్నది. వ్యాపారదృష్టి పడినాక యిక నవలల్లో సామాజిక దృక్పథం ఎలా వస్తుంది? రాశి పెరిగింది. యిక వాసి ప్రశ్నార్థకమే. కువ్వనూర్పిడి జరిగితేనే తాలు అసలు తేలేది. వద్యాలమీద జరిగినంత చర్చ నవలల మీద జరగలేదు.

జీవితాన్ని అసలైన అద్దంలో చూపించాలి నవల. 'అసలైన అద్దం' అని ఎందుకంటున్నానంటే, కొన్ని దొంగ అద్దాలుంటాయి. అవి మనల్ని మనంగా చూపించవు. నవలలు సినిమాలకు ప్రతిబింబాలుగా కాక, సామాజిక చైతన్యంతో సామాజిక దృక్పథంతో నవలా రచన సాగాలి.

'జాషువా ఫౌండేషన్' ఫౌండర్, కన్వీనర్ అక్కినేని బలరాం, ట్రస్టీ హేమలతా లవణం ఇద్దరూ యీ ఆవేదనతోనే సాహిత్య చర్చలు నిర్వహిస్తున్నారు. ఇక ముందు కూడ 'తెలుగు కథ', 'తెలుగు నాటకం' 'తెలుగు విమర్శ' పై చర్చ ఏర్పాటు చేస్తాం" అని చర్చకు భూమిక నందించారు.

# ఉద్యమస్ఫూర్తి - విభిన్న పార్శ్వాలు

సమకాలీన సంఘ జీవితాన్ని రాజకీయార్థిక విశ్లేషణతో చారిత్రక 'సామాజిక నవల' కాగా. అటువంటి సామాజిక వాతావరణంలో అరుదుగా ఉద్భవించే ప్రజా పోరాటాలను చిత్రించేది 'ఉద్యమ నవల'. తెలుగు సాహిత్యంలో ఉద్యమస్ఫూర్తితో వచ్చిన రచనల్లో కవిత్వ ప్రక్రియే ఎక్కువగా ఉన్నా, నవలలు కూడా లేకపోలేదు. ఉద్యమ నేపథ్యంలో వచ్చిన తెలుగు నవలలు స్థూలంగా నాలుగు విధాలు.

1) జాతీయోద్యమ స్ఫూర్తితో వచ్చినవి. హరిజనోద్యమ నవలలు, సంఘ సంస్కరణ నవలలు ఈ విభాగంలోనివే.

2) తెలంగాణా సాయుధ పోరాట నవలలు.

3) నక్సల్‌బరీ పోరాట నవలలు.

4) స్త్రీవాద ఉద్యమ నవలలు.

ఈ ఉద్యమ నవలలు రెండు విధాలుగా ఉంటాయి ఉద్యమ నేపద్యంలో వ్యక్తి జీవితాన్ని చిత్రించేవి ఒకరకమైతే, వ్యక్తి జీవితం అనుషంగికమై, ఉద్యమమే ప్రముఖంగా చిత్రించబడేది రెండవభాగం.

తెలుగులో వచ్చిన ఉద్యమ నవలలన్నీ పై రెండు తరగతుల్లో ఏదో ఒక విభాగం క్రిందకి వస్తాయి. దాశరధి రంగాచార్యగారు రచించిన 'చిల్లర దేవుళ్ళు' మొదటి రకానికి, 'మోదుగ పూలు' రెండో రకానికి ప్రశస్తమైన ఉదాహరణలు.

హరిజనోద్యమ స్ఫూర్తితో వచ్చిన నవలల్లో హేలావతి, మాలపల్లి, హరిజన నాయకుడు, నరుడు, మల్లిక అనేవి చాలా ఉండగా అన్నిటిలోకి ఉద్యమస్ఫూర్తిని అన్ని పార్శ్వాల నుంచి చూపిన రచన 'మాలపల్లి' అని చెప్పారు. ఉద్యమ జీవితంలో భాగమైన ఆత్మ సంస్కారానికి ప్రతీకగా సంగదాసును, మొక్కవోని ధైర్యానికి ప్రతీకగా రామదాసును, పోరాట శీలానికి ప్రతీకగా వెంకటదాసును రచయిత సృష్టించి, హరిజనోద్యమానికి కొత్త ప్రేరణ నిచ్చారు. జాతీయోద్యమ నవలల్లో గాంధీమహాత్ముడినీ, ఆయన బోధనలనూ ప్రేరణగా తీసుకుని రచించిన నవలలెన్నో ఉన్నాయి. వాటిలో వేలూరి శివరామశాస్త్రి 'ఓబయ్య', 'మహీధర' రామమోహనరావు కొల్లాయి గట్టితే నేమి, ఇత్యాదులు ఉన్నాయి.

తెలంగాణా సాయుధ పోరాట నవలలు 1936 నుంచి 1947 వరకు నిజాం నిరంకుశపాలన, జాగిర్దార్ల అమానుషత్వం, రజాకర్ల దౌర్జన్యాలు ఇతివృత్తంగా తీసుకొన్నాయి. వట్టికోట అల్లారుస్వామి 'ప్రజల మనిషి', 'గంగు', మహీధర రామమోహనరావు 'ఓనమాలు', 'మృత్యువు నీడల్లో', బొల్లిముంత శివరామకృష్ణ 'మృత్యుంజయులు' దాశరధి రంగాచార్య నవలలు ఇందులో ప్రఖ్యాతి నొందిన మంచి నవలలు. ఈ నవలలన్నీ దాదాపు సామ్యవాద దృష్టితో రాసినవే.

1947 నాటి తెలంగాణా సాయుధ పోరాటానికి ప్రతిధ్వని మళ్ళీ 1967లో శ్రీకాకుళం రైతాంగ పోరాటంలో వినిపించింది. నక్సల్‌బరీపోరాటంలో ఉత్తేజితులైన శ్రీకాకుళం గిరిజనులు భూస్వాములపై తిరగబడ్డంతో 1968లో ఆంధ్రప్రదేశ్ నక్సల్ ఉద్యమం తీవ్రస్థాయికి చేరుకుంది. ఈ పరిస్థితిని, పోరాటాన్ని ప్రతిబింబిస్తూ నవలలు రాసినవారిలో భూషణం, అల్లం రాజయ్య, సాహు, సాధన ఇత్యాదులు ముఖ్యులు.

1930 నుంచి గుడిపాటి వెంకటాచలం అందిస్తున్న చైతన్యంతో 'స్త్రీ వాద ఉద్యమం' క్రమక్రమంగా నిలదొక్కుకుని 1980 దశకంలో స్త్రీ వాద నవలలు వెలువడ్డం ప్రారంభమైంది. రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి, లత వంటి రచయితులు స్త్రీల దృష్టినుంచి సమస్యలను చిత్రించడాన్ని ప్రారంభించగా, ఓల్గా ఉద్యమ స్ఫూర్తితో స్త్రీల సమస్యల పైన పూర్తి దృష్టిని కేంద్రీకరించి నవలలు రాస్తున్నారు. రంగనాయకమ్మ 'జానకి విముక్తి' ఓల్గా 'స్వేచ్ఛ' 'మానవి' 'ఆకాశంలో సగం' వంటివి స్త్రీ వాద ఉద్యమంలో అగ్రశ్రేణిగా నిలిచే నవలలు.

1920 దశకం నుంచి ఇప్పటివరకు విధిగా ఉద్యమాలలోని భిన్న భిన్న వర్గాలను చిత్రించడానికి గణనీయమైన కృషి జరిగినా, ఈనాడు అటువంటి చైతన్యాన్ని ప్రతిధ్వనించే నవలా సాహిత్యం కనిపించడం లేదు. నవలా రచన ఈనాటి వ్యాపార సంస్కృతిలో భాగమైపోయినందున, నవల కూడా వ్యాపార సరుకులా తయారై తన మౌలిక లక్షణాలను కోల్పోతోంది. రచయితలు తమకు సామాజిక బాధ్యత ఉందని గుర్తించినపుడు, సాహిత్యం ఆలోచనాత్మకంగా ఉండాలని అర్ధం చేసుకున్నపుడు చైతన్యస్ఫోరకమైన రచనలు మరిన్ని రాగలవు. నవలలతో వ్యాపారం చేస్తున్న పత్రికలు కూడా తమ సామాజిక బాధ్యతను గుర్తించినపుడే నవలలకు ఇప్పుడున్న క్షీణదశ తొలగిపోయి ప్రయోజనవంతమైన నవలాసాహిత్యం వెలుగులోకి వస్తుంది.

— మృణాళిని



# కుటుంబ వ్యవస్థ - నాడు నేడు

సాహిత్యాన్ని సమాజంలో అనుసంధించే సాహితీప్రక్రియ నవల. రచయిత తనలోని "Second Self" ని ఆవిష్కరించటానికే రచనలు చేస్తాడు, అంటాడు, — జాన్‌పాల్‌సార్త్రే.

"మానవుడు చారిత్రకవ్యక్తి. అతడిని దైవం రూపొందించలేదు. చారిత్రక సామాజిక పరిణామక్రమాన్ని అనుసరించి మానవుడి వ్యక్తిత్వం రూపుదిద్దుకోవాలి" అంటాడు ల్యూకాస్ "హిస్టారికల్ నావెల్" లో – అందుచేత నవలా విమర్శ విధిగా సామాజికమే కావాలి.

కుటుంబం ఒక వ్యవస్థ. సమాజంలో ఒకభాగమయి, అంతరిక మయిన మార్పులెన్ని వచ్చినా, తన యేలికతను నిలుపుకొనేది వ్యవస్థ – వేదకాలంలో కుటుంబ వ్యవస్థ అర్ధధర్మాన్ని ఆశ్రయించుకొని ఉన్నా. కుటుంబ వ్యవస్థలో స్త్రీకి కొంత వెసులబాటు ఉండేది. బహుభార్యత్వమూ, బహుభర్తృకత్వమూ కూడా అమలులో ఉండేవి. సూత్ర కాలం నాటికి కుటుంబ వ్యవస్థ స్త్రీని అనేక నిర్బంధనలమధ్య బిగించింది. ముస్లిం దండ

యాత్రలకారణంగా సమాజంలో స్త్రీకి భద్రతలేక పోవడం ఇందుకు కారణం కావచ్చు -

వీరేశలింగం యుగంలోనూ, (రాజశేఖరచరిత్ర - మొదలైనవి) ఆ తర్వాత కూడా ఎదిరించ లేదు - 1930 తర్వాత సమాజంలో ఎన్నో మార్పులు వచ్చాయి. అవి సాహిత్యంలోనూ ప్రతిఫలించాయి. ఒకే సమాజాన్ని విశ్వనాథ, చలం, కుటుంబరావు, గోపీచంద్ భిన్న దృక్పథాల్లోంచి తమసాహిత్యంలో చూపించారు.

విశ్వనాథ కరిగిపోతున్న ఆచారాలు, సంప్రదాయాలు, ఉత్తమమైనవని నిరూపించటానికి ప్రయత్నించారు. అవి నిలిచితీరుతాయనే తమ విశ్వాసాన్ని ప్రకటించారు. అయినా, ఆయన పాత్రలు వాసంతి, మంగమ్మ మొదలైనవి ఆనాటి సామాజిక చైతన్యాన్ని ప్రతిఫలిస్తాయి. గోపీచంద్ స్త్రీవ్యక్తిత్వవికాసానికి వ్యవస్థ బందిఖానా కాకూడదని స్పష్టంగా ప్రకటించాడు. కుటుంబరావుగారు అటు ఇటు కాని మధ్యతరగతి వ్యవస్థను బాహాటంగా ఢీకొని, ఆచరణయోగ్యమైన పరిష్కారాలను సూచించాడు.

తరువాత వచ్చింది రచయిత్రులయుగం - మొదటి దశలో స్త్రీవ్యక్తిత్వాన్ని గుర్తించాలని మాత్రమే పోరాటం జరిగింది. (పేకమేడలు మొదలైనవి) తర్వాత స్త్రీ స్వాతంత్ర్యపోరాటం రచయిత్రులరచనల్లో ప్రతిఫలించింది. (స్త్రీ, - ఉరిత్రాడు, వైతరిణి, జానకి విముక్తి - మొదలైనవి) ఇటీవల స్త్రీవాదం తలఎత్తి అతిత్వరలో ఉద్యమరూపం పుంజుకుంది. ఈధోరణిలో ప్రథమ శ్రేణి రచయిత్రి ఓల్గా - ఆమె రచనలు "స్వేచ్ఛ" - "మానవి" - "ఆకాశంలోసగం" మొదలైనవన్నీ స్త్రీ వాద ధోరణిని ప్రకటిస్తాయి.

సమాజం ఎప్పుడూ తనకు ఏది అవసరమో, దానిని మిగుల్చుకుంటుంది. సమాజానికి కుటుంబం అవసరం- అందుచేతకుటుంబం ఏదో ఒక రూపంలో సమాజంలో నిలిచే ఉంటుంది.

— సి. ఆనందారామం

---

స్వార్థంతో సంబంధాలు త్రెంచుకొని
సకల గ్రహాలతో బాంధవ్యం పెంచుకొని
సృష్టి పర్వాన్ని ఒకే
శాశ్వతానంద సూత్రంతో
సింధిదాం"

. జె. బాపురెడ్డి



# తెలుగు - నవల సామాజిక స్పృహ సదస్సు

తెలుగు నవల వస్తురూపం పరిణామాన్ని గూర్చి నేను ఉపన్యసించాలి. తెలుగు నవలకు సుమారు 125 సంవత్సరాల చరిత్ర ఉంది. కొన్ని వేల నవలలు వచ్చి ఉంటాయి. ఆసక్తి కరమైన విషయం ఏమంటే తెలుగు నవల రూపు రేఖలు దిద్దుకున్న తర్వాత మొదటి 25 సంవత్సరాలలో 15 నవలలు కూడా రాలేదు. ఇప్పుడేమో నెలకు 25 నవలలు వస్తున్నాయి. ఈ ప్రక్రియ పుట్టిన తర్వాత పాతిక సంవత్సరాల దాకా నవల అన్న పేరు లేదు. 1897లో ఈ ప్రక్రియకు నవల అనే పేరు స్థిరపడింది. అంతకుముందు ఈసాహిత్యప్రక్రియను వచన ప్రబంధమని అనే వాళ్ళు. వీరేశలింగం పంతులు కూడా స్వీయచరిత్రలో తెలుగులో మొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని అన్నారు. చిలకమర్తి గొప్ప నాటకరచయితగా ప్రసిద్ధికి రావడంవల్ల ఆయన మొత్తం పథ్నాలుగు నవలలు రాసినా తొలి రోజుల్లో నవలా రచయితగా రాణించలేదు. అయితే చారిత్రక నవలా రచయితలకు ఆయనదే వరవడి. క్రమంగా వచన ప్రబంధం అనే పేరు పోయి నవల అనే పేరు స్థిరపడింది.

తెలుగు నవల వస్తురూప పరిణామాన్ని నిర్ధారించి చెప్పడం కష్టం. పరిణామం ఇదమిద్ధంగా నిరూపించలేము. ఏమంటే మాలపల్లి రచవా

కాలంలోనే హిమబిందు కూడా వచ్చింది. ఇప్పుడే 1994లో కూడా చారిత్రక నవలలు వస్తున్నాయి. పాఠకలోకంలో ఆదరాన్ని పొందుతున్నాయి. ఒక ప్రక్కన చలం, కుటుంబరావు, జి వి. కృష్ణారావు, గోపీచంద్, సాంఘిక నవలలు రాస్తూ ఉంటే బాపిరాజు, విశ్వనాథ, నోరి నరసింహశాస్త్రి చారిత్రక నవలలు కూడా అదేకాలంలో రాస్తూవచ్చారు.

సాంఘిక నవలలు వేరు. సామాజిక నవలలు వేరు. సంఘంలోని లోపాలు, దోషాలు, అవాంఛనీయమైన పద్ధతులు, వీటి వల్ల వ్యక్తులు పడే బాధలు తెలియజేసేవి సాంఘిక నవలలు. అట్లా కాకుండా సమాజాన్ని నడిపేమౌలికమైన మానవ సంబంధాలు, అనుబంధాలు, ఆర్థిక సామాజిక నైతిక మతసమస్యలు, రాజకీయ సిద్ధాంతాలు గూర్చి చెప్పేవి సామాజిక నవలలు. తెలుగులో మాలపల్లి తోనే సామాజిక నవల ఆవిర్భవించింది. తెలుగులో 10 దాకా ఇతిహాసిక నవలలున్నాయి. మానవజీవితాన్ని సర్వసమగ్రంగా వ్యాఖ్యానించేవి సామాజిక నవలలు. మాలపల్లి, వేయిపడగలు, ఛంఘిజ్ ఖాన్, అతడు-ఆమె, వంటివి 'క్లాసిక్స్', తెలుగులో వచ్చిన మొదటి నవలల పేర్లు చరిత్ర, విజయం, విలాసం అని ఉండేవి. శిల్పవిషయంలో ప్రాథమిక దశ వాటిలో కనపడుతుంది. ఇక చివరకు మిగిలేది, అల్పజీవి, కీలు బొమ్మలు, ఇంక్రెడిబిల్ గాడెస్ వంటి ఆధునిక నవలల్లో వస్తు, రూప పరిణామం కూడా కనపడుతుంది. రూపపరిణామాన్ని విపులంగా చెప్పలేము. దినచర్య పద్ధతిలో, ఫ్లాష్ బాక్ పద్ధతిలో, లేఖలరూపంలో, ప్రతీకాత్మక ధోరణిలో, చైతన్య ప్రవంతి రూపంలో సాంఘికసమస్యలు వ్యక్తుల సమస్యలు కూడా తెలుగు నవలలో ప్రతిఫలించాయి.

నవలా రచన కుడ్య చిత్రకళ వంటిది. అంధ్రుల ప్రతిభ మినియేచర్ పెయింటింగ్‌లో కనపడినంతగా వాల్ పెయింటింగ్‌లో కనపడదేమో నన్నాడు శ్రీ.శ్రీ. తెలుగులో చిన్నకథ, కవిత్వం సాధించిన పరిణతిని నవల సాధించలేదు అనీ, మంచి కవిత్వం గొప్ప కథ వచ్చినట్లు గొప్ప నవల రాలేదనీ చిరకాలంనుంచీ నాదొక ఫిర్యాదు వుంది అన్నాడు శ్రీశ్రీ. కాని తెలుగులో గొప్ప నవలలు వచ్చాయి. చంఘిజ్ ఖాన్, చివరకు మిగిలేది, అల్పజీవి, రాజు, మహిషి, అసమర్థుని జీవనయాత్ర గొప్ప నవలలు.

తొలిదశలో నవలా రచయితలు తమకు తెలిసిన సమస్త విషయాలూ నవలలో చొప్పించాలనుకునేవారు. మాలపల్లిలో బాల్యక్రీడలు, జానపద గీతాలు, బ్రహ్మసమాజం, హిందూ మత ప్రాతిపదిక సిద్ధాంతాలు, ఆఖరుకు సాముద్రిక శాస్త్రం గురించిన ప్రసక్తి కూడా వుంది. బాపిరాజు నారాయణరావులో సంగీత వాయిద్యాల చరిత్ర, వయొలిన్ ఏదేశంలో పుట్టి ఈ దేశానికి ఎలా వ్యాపించింది మొదలైన విషయాలున్నాయి. వీరేశలింగం రాజశేఖర చరిత్రలో గోదావరి నది వర్ణన ప్రారంభంలోనే 3 పేజీలలో కనపడుతుంది. 1872 నుంచి 1994 దాకా తెలుగు నవల క్రమ పరిణామ వికాసాన్ని గమనిస్తే ఐదారు ముఖ్యమైన ఘట్టాలు కనపడతాయి. వీటిని కొన్ని సూత్రాలుగా చెప్పాము. మొదటిదశలో ప్రబోధాత్మకంగా ఆ తర్వాత జాతీయోద్యమ ప్రచారాత్మకంగా, ఆ తర్వాత సామాజిక సమస్యల నేపథ్యంతో, అటు తర్వాత మనోవిశ్లేషణాత్మకంగా తెలుగు నవల సాగింది. వస్తువులో గొప్ప వైవిధ్యం కనపడినంతగా రూపంలో పరిణతి నిర్ధారణగా చెప్పలేము.

ఇప్పుడు కేవలం ఉల్లాసం, వినోదం ఉద్రేకప్రవృత్తులు రెచ్చకొట్టడానికి నవలలు వ్యాపారధోరణి నాశ్రయిస్తున్నాయన్న అభియోగంవుంది. సమాజానికి లక్ష్యం నిర్దేశితంకాకపోతే సాహిత్యానికి అంతే. ఇప్పుడదే జరుగుతున్నది.

— ఎ. రమాపతిరావు (మంజుశ్రీ)



# ఆ నాడు ....

అది పందొమ్మిది వందల యాభై రెండో–మూడో ప్రాంతం. కాకినాడలో జరుగు కవి సమ్మేళనానికి జాషువా ఆహ్వానింప బడినారు. శతావధాని భేళపిళ సత్కావీంద్రులు; కవిరాజు త్రిపుర్నేని, మరికొందరు కవి పండితులతో పాటు, "మాజాతే కవిత్వం సృష్టింప అర్హులు" అనే మూఢ సమ్మకమున్నవారు ఆ కవులలో వున్నవారు. ఒక కవి జాషువా కవిత్వాన్ని, ప్రతిభాపాటవాన్ని హేళనచేస్తూ చేసిన వాఖ్యాలు జాషువానే కాక, సభలో ఒకభాగాన్ని కత్తులై కోశాయి........

"లెమ్మోయీకవీ! సభాంతరమున నిన్నూ, నీకవిత్వాన్ని గ్రంధాలను స్వార్ధంతో, యీర్ష్యతో చేసిన యీహేళనకు నీ జవాబు?"–అన్నారు.

అవమానాన్ని రాజుకొని మంటలై కాల్చగా జాషువా లేచి శిరమెత్తి–కవితా గళమెత్తి........

"గవ్వకు సాటిరాని పలుగాకుల మూక లసూయ చేతన
వెవ్విధి దూరినన్ నను వరించిన శారద లేచిపోవునే
యివ్వసుధా స్థలిం బోడమరే రసలుబ్ధులు ఘంట మూనెదన్,
రవ్వలు రాల్చెదన్ గరగరల్ సవరించెద నాంధ్రవాణికిన్"—

ఆ గర్జన సభ యావత్తును స్తంభీకృతం గావించింది....కులతత్వాహంకారం తలవాల్చింది.

సేకరణ : హేల

ఎన్నండీ రణవహ్ని చల్లవడు, గింకెన్నండు దిగ్దేశముల్
రన్నుల్ విచ్చెడి, విశ్వలోక సమతాకల్యాణ సంపత్తు లిం
కెన్నం డబ్బెడి? నానతీయ గదవే యేదేని మార్గంబు మా
కన్నా! జ్ఞానకళాలమిత్రమ! దయాపూర్ణాంత రంగుడవై.

సమరసభావ నిశ్చల పరిశ్రమకు బ్ర
హ్మాండంబు లుమ్ముఖంబయినదాక!
వ్యత్యయంబైన తీవ్రాస్పృశ్యతాజాడ్య
మన్నివిధాల నాపజీనదాక,
నాజాతి నావారు నాదేశమని పొంగు
స్వాభిమానము శూన్యమయినదాక,
విశ్వసౌభ్రాత్రంబు వెలయించు నైక్యసం
ధానవ్యాప్తి దిశల పెంపారుదాక,

జ్ఞానమత సాంఘిక స్వేచ్ఛ సల్పురటను
నేకరీతి లాభించునందాక, రాదు
భావిభారత కల్యాణ పరమ సుఖము!
కాక చల్లార దెపుడు సంగ్రామముఖము.

— జాషువా